# అరుణతార

సాహిత్య సాంస్కృతిక మాసపత్రిక

అక్టోబర్ 1997 192



## 1917 అక్టోబర్ విప్లవం వర్ధిల్లాలి

మార్క్సిజం లెనినిజం మావో ఆలోచనా విధానం వర్ధిల్లాలి



# కల్లోల పల్లె చెరువు

రాత్రి పక్షి నల్లగా కూస్తుంది
చీకటి పాట పల్లె ఒంటి చుట్టూ మంచై ముసుర్తుంది
ఊరు వరికుప్పవుతుంది
అడవిమీంచి అర్జంటుగ ఆగమించిన ముదురుపచ్చగాలి
రాత్రి భాషలో రహస్యాల్ని రాల్చిపోతుంది
నడిచి నడిచి అలిసి సొలిసిన నాగలి
గుడిసె గుండెలో కీచురాయి అవుతుంది
రాత్రంతా కళ్ళల్లోకి కలలు కలలుగా వ్రేలాడ్తుంటుంది
పల్లె చెరువు చుట్టూర నిశ్శబ్దం వలై బిగుస్తుంది
ఆకాశం శాంతివనంలో చుక్కలన్ని బిగ్గరగా సంభాషించువేళ
నక్కలన్ని గుమిగూడి చుక్కల సభ నెక్కిరించువేళ
కీచురాయి గొంతులో రాయిపడ్తుంది
బుర్రలో తెల్లకొంగలు బురద తొక్కుతుంటే
చేతికి తుపాకీ కంకణంతో రిమోట్ కంట్రోలింగ్ రేకు రూపాలు
కాళ్ళకింద అలారంతో ఊరిమీద మిడతల దండౌతాయి
అంతే—
మాంసం చెట్టుకొమ్మలు కొరికేయబడ్తాయ్
కాండంపై తుపాకీ పంటిగాట్లు పకపకమంటాయ్
నాగలి కాళ్ళూ చేతుల మధ్య కనెక్షన్ కత్తిరించబడ్తుంది
గుడిసెల తలపగిలి నడుం విరిగి భూమి ఒడిలోకి జార్తాయ్
బావి భోరున నిట్టనిలువున నీరైతుంది
బాటవీపు బొబ్బలెక్కి రసి కార్తుంది
వరికుప్ప తగలబడ్తూనే ఉంటుంది
బయొనెట్ కొసన చిక్కిన రాత్రిపక్షి
రెక్కల చుక్కలతో బతుక్కోసం ఎగిరిపోతుంది
అప్పుడే—
రాత్రంతా రక్తంలో తడిసిన సూర్యుడు
ఎర్రగా పల్లెమీంచి లేచి వస్తుంటాడు

— వడ్డెబోయిన శ్రీనివాస్




సంపుటి : 20 అక్టోబర్ '97
సంచిక : 10 192



**వి. చెంచయ్య**
వర్కింగ్ ఎడిటర్, అరుణతార
6-5-13, కావలి (Po)
నెల్లూరు జిల్లా - 524 201
ఫోన్ : 42277

**జి. కళ్యాణరావు**
కార్యదర్శి, విరసం
పార్వతమ్మ గుడివద్ద, గంటాపాలెం
ఒంగోలు - 523 001
ప్రకాశం జిల్లా

ఈ సంచిక వెల : 5 రూ.
సంవత్సర చందా : 50 రూ.

రచనలు, చందాలు
వర్కింగ్ ఎడిటర్ అడ్రసుకే పంపాలి

# విషయసూచిక

# కవిత

## చెట్ల కొమ్మల్లో చిక్కిన మాంసం ముద్దలై...

జిట్టెడు పొట్టకై జెర్రిపోతులాడిస్తోన్నాం.
బతుకు బండిని ఈడ్వలేక
బాధల ఊసులను భుజానమోస్తూ
దండకారణ్యాన్ని శాఖోపశాఖలుగా
విస్తరించాల్సిన నీవు
ఖాకీ రంగును పులుముకొన్నావు........
పాలకుల పాదాల వద్ద తోకూపుతోన్నవు........
గడచిన బతుకుల చేదును మరిచి
పుట్టి పెరిగిన పంట చేలను పలుకరించకుండా
వంచనతో
విరిసిన ఇంద్రధనుస్సును కొరికిపేయాలనీ,
చెల్లుకు పొదిగిన పిచ్చుక గూళ్ళను పెరికి పేయాలనీ,
పాలీషు పెట్టిన పళ్ళతో
అధికారం చేతి గొలుసుకు బంధించబడ్డావు........
ప్రమోషన్ల పేటలోబడి రేయింబవల్లు
భూస్వాముల ముంగిట్ల కావలికాసావు........
వుషుక్కు మనగానే పూనకం వచ్చినట్లు
పల్లె వనాలను నెత్తుటి మయం చేసావు........
కడుపులో మండి, పిడికెడు మెతుకులకై
గుర్రుమని కోరలు చాపినపుడు
విసిరేసిన పులి విస్తరిలోని ఎంగిలి మెతుకులే కదా !
నీ నోటి ముందు రాలిపడ్డవి........
కండకావరం పెరిగి నేనే రాజని, నేనే రాజ్యమని
అహంకారంతో విర్ర వీగినపుడు

చెట్ల కొమ్మల్లో చిక్కిన మాంసం ముద్దలై
నీ యింటి దీపానికి దర్శనమిచ్చావు.
యింటిల్లిపాది కార్చిన కన్నీళ్లలో
నీవు పులుముకొన్న ఖాకీ రంగు కరిగిపోయి
దండకారణ్యం విస్తరిస్తోంది
ఎర్రటి మట్టిపై శాఖోపశాఖలుగా............ ...

—నటరాజ్

## నెత్తురు పూవు

ఒంటి నిండా పరుచుకున్న రక్తం
ఏన్నో ఊసుల్ని ఒలకబోసే కళ్ళు
నిర్దయగా ట్రాన్స్‌ఫార్మర్‌కి వేళ్ళాడతాయి
అర్థరాత్రి కాదు అపరాత్రి కాదు
వరిచేలో రక్తపు ముద్ద

× × × × × ×

Un-natural deaths are Indexes of the Struggle
తెలంగాణ ఒక నెత్తురు పూవు

× × × × × ×

బ్రతకటానికి
తిండి, బట్ట, గూడు
జీవించటానికి
ఒక ఆయుధం కావాలి

—సదానందం పెట్టుగడి

## విషముష్టి చెట్టు

నెత్తిన
కౄర జీవ శిరస్సు కప్పుకున్న
ఓ. శునకమా !
వాడు
తలల మెడల్స్ తగిలించి
రివార్డుల మెతుకులేసి
"ఉజ్జా"........ అన్నప్పుడల్లా
కరువడమే నీ పని

జనం చేతి కూడు తిని
మదమెక్కి
ఎర్రి లేచిన నీకు
జనాలే కూడ్రై రి
విషముష్టి చెట్టని
పెరట్లో పాతుకుంటే
నీ ఒళ్ళే గుబురై
పాముల పుట్టను అల్లుకొని
కంచై నప్పుడు
నేటి మా యుద్ధంలో

ముందు రాలేది నువ్వే
నేల తల్లి పురిట్లో పూసి
ఖాకీ వాసన కొడ్తున్న నిన్ను
ఊరి మల్లెవైనా
అడివి మల్లెవైనా
ఏరి పారేయాల్సిందే
తప్పదు మరి
ఇప్పుడు
జనాల చేతులే
ఆయుధాలై నయ్

—ఫర్జాన్ సింగ్

## ఎర్రజెండా ఎగురవెయ్యాలి

తిండి గుడ్డా పరుల కమ్మీ
పెట్టుబడులకు బిచ్చమెత్తీ
దేశ ప్రగతికి అదే దారని
జానిసత్వం నెత్తికెత్తే
దొంగ మాటలు నమ్మవద్దండీ
ఏలికల కెంగిలి విడిల్చి
గనులు వనులూ దోచుకుంటూ
రక్తమాంసాల్ పీల్చుకుంటూ
దేశ సంపద కొల్లగొట్టే
సామ్రాజ్యవాదుల తరిమికొట్టాలి
పరాయ్ ధనికుల కాళ్ళు పిసుకుతు
బందిపోటుల పంచజేరీ
కష్టజీవుల కడుపు కొడుతూ
దోపిడీతో మదం బలిసిన
దళారీలను దంచి వంచాలి
అధీకారపు అడ్డదారుల
ఆస్తిపాస్తులు కూడబెడుతూ
కుంభకోణపు గోల్ మాలుల
నడమంత్రపు సిరులగాళ్ళకు

నడీవీధులో నడ్డి విరచాలి
బడా దొరలై బరి తెగించీ
భూమినంతా ఆక్రమించీ
పాటుబడి పంటల్ని తీసే
దున్నెవారిని కడుపు మాడ్చే
భూస్వామ్యం మట్టుబెట్టాలి
ధరలు పెంచీ కూలి దించీ
జనం బతుకులు బుగ్గి చేసీ
ప్రజా పోరును కాలరాసే
కండకావర కాయితం పులి
ప్రభుల హింసను కాల్చివేయాలి
మాయమాటల బుజ్జగింపుల
ఎండమావుల ఎరలు చూపీ
క్రూర మృగమై మెడలు కొరికే
దొంగ యుద్ధపు దోపిదోళ్ళను
మాటుగాసీ మట్టుబెట్టాలి
కిరాయి సైన్యం అండ జూసుకు
తుపాకీతో రాజ్యమేలే
పాలకుల్నే కాల్చి కూల్చగ

ప్రజాసైన్యం కూడగట్టీ
ప్రజాయుద్ధం దారి నడవాలి
ప్రజల నందరి ఒకటి చేసీ
దీర్ఘకాలపు ప్రజా పోరులో
ప్రజాతంత్రం సాలు బోసీ
దోపిడీ పీడనల కూల్చి
ప్రజారాజ్యం మనం తేవాలి
కష్ట ఫలితం శ్రమకు దక్కి
కడుపు నిండీ కలలు పండీ
చదువు సంధ్యలు - కాయకష్టం
చెట్టపట్టాలేసు కెదిగే
సమసమాజం వెల్లివిరియాలి

ఎన్ని ఓటము లెదురుపడ్డా
చిట్టచివరకు మనదె గెలుపని
మంది బలిమికి ఎదురె లేదని
నాల్గు దిక్కుల చాటి చెప్పే
ఎర్రజెండా ఎగురవేయాలి
ఎందరెందరొ అమరవీరులు
ముందు చూపిరి యిదే మార్గం
మదిని నిలిపి వారి త్యాగం
సడలకుండా నడిచిపోదాం
వారి కోరిక నిజం చెయ్యాలి

—వి. సాంబయ్య

## లేగదూడలు

పండిన పంట చేతులు కట్టుకుని
అప్పుల ఖాతాకింద గోదాములలో చతికిలబడ్డది
కాళ్ళు విరిగిన లేగదూడ కూలబడిపోయింది
బండరాయితో మోదగా చచ్చిన దళితుడి ఆత్మగౌరవం
అగ్రకులం కాలికింద చెప్పయింది
ఆధిపత్యం కింద నలుగుతున్న మల్లె తోట
విరబూసి, గుబాళించటం మానేసింది
బుర్రమీసాలు గల బీరువాలో దాగిన పట్టాకాగితాలు
ఉసూరుమంటూ భయం భయంగా మూల కూర్చున్నాయి
లేగదూడలను ఆంబోతులు కుళ్ళబొడుస్తుంటే
కమిలిపోయి నిస్సత్తువుగా వున్న జీవులు
సాష్టాంగ ప్రమాణం చేస్తున్నాయి

* * *

నలిగిన తోవను నెత్తికెత్తుకున్న లేగదూడలు
స్పృహ తప్పిన వాటికి కొత్త ఊపిర్లందించి
దించిన తలలతో ఎగదన్నడమెలాగో నేర్పుతున్నాయి

పడవ మునగకుండా తెరచాప దించి
ఏటికి ఎదురుపోతున్న నావికుడు నిబ్బరంగా మున్ముందుకే పోతున్నాడు

* * *

కమిలిపోయిన ప్రాంతాన్ని తడుముతుంటే
బిగపట్టిన పళ్ళు శపధాలు చేస్తున్నాయి
అంబోతులను కుమ్మటానికి లేగదూడలు సైగలు చేసుకున్నాయి
గొడ్డళ్ళు, బరిశెలు, కత్తులు కాంటాక్ట్ ప్లేస్‌లో
"లాల్‌సలామ్" చెప్పుకున్నాయి
గిట్టలను నాలుగుసార్లు నేలకు రాపాడించి సాయుధ సైన్యం కదిలింది
అడ్డదిడ్డంగా నరికిన అంబోతుల తలలు
ఫెళుక్కు..... ఫెళుక్కుమంటూ విరిచేసిన కొమ్ములు పట్టుకుని
లేగదూడలు నడిరోడ్డుమీద ఫీంకరిస్తూ దుముకులాడాయి
చతికిలపడ్డ పంట ఒక్క ఉదుటున పైకిలేచి బయటకొచ్చింది
చెప్పులు కరుస్తూ కాలినే నమిలేస్తున్నవి
బీరువాని చూసి పట్టా కాగితాలు
వెకిలిగా నవ్వుతూ హేళన చేస్తున్నాయి
'అంటరానితనం' ఊరిమధ్యకొచ్చి
జబ్బలు చరుస్తూ, భూములు పంచుతున్నది
(దళితులపై దాడులు చేస్తున్న అగ్రకుల పెత్తందార్లపై
దళం పంచాయతీ చేసిన సందర్భంలో.....)

—కొడుకు

## సాయుధుడా లాల్‌సలామ్

ఆ క్షణం
నేను దుఃఖాన్ని
ఆపుకోలేకపోయాను
నా గుండె
విస్ఫోటనం చెంది
నా అణువణువూ
విద్యుత్తు ప్రవహించింది
ఎన్నాళ్ళనుండో
నాలో వున్న
జడపర్వతం బద్దలైంది
నువ్వు నా చేతిలో
నీ ఆయుధాన్ని వుంచి
అన్నా అని
నన్ను నీ గుండెల్లో
పొదువుకున్నప్పుడు
నీ ఆయుధాన్ని

నిమురుతుంటే
నా గుండె గాయాల్ని
నీ వెచ్చని వేళ్ళతో
మాయం చేస్తున్నట్లుగా వుంది
అశేష పీడిత ప్రజల
ఆకాంక్షలన్నీ
నీ ఆయుధంలోంచి
తొంగి చూసినట్లుగా వుంది
నీ తుపాకీ బ్యారెల్లోంచి
అమరుల ఊపిర్లు
వినపడుతున్నాయి
సాయుధుడా
నీకు మా వేనవేల
పోదుదండాలు

—జంఝూవతి

## నియంత అంతరంగం

నేను కవితను బహిష్కరించాను
వద్దు పొమ్మని నిషేధించాను
విడాకులిచ్చి వదిలించుకున్నాను
దూరంగా వెళ్ళటానికి నాకు నేను దూరమయ్యాను
నన్ను ఇంకా వదలని కవితను ముస్తాబు చేసి పాటగా మార్చాను
నన్ను ఇప్పటికీ ప్రశ్నించే కవితను సమాధానపర్చలేక సతమతమయ్యాను
వచనంలో వొదిగిన కవితను దాని అనుమతి లేకుండనే
పాటగా రాసి జనం మధ్య డప్పు మీద గానం చేసినప్పుడు
కవిత మెలికలు తిరిగింది, సిగ్గుపడింది
నా మీద కలం ధర్నా చేసింది
ఎనిమిది గంటల పనివేళ కోసం నినదించింది
అందులో భాగంగానే కవితతో చేతులు కలిపింది
నన్ను నియంతగా చిత్రించి నాపై యుద్ధం ప్రకటించారిద్దరూ
నా కూనిరాగాలకు బెదిరిన కోయిల
ఇంటి ఛాయలకు రావటం మానేసింది
నన్ను తిట్టుకుంటూ అది శత్రు శిబిరంలో కలిసిపోయింది
నిద్రలేపే కోడిపుంజు
ఎడతెగకుండా రాత్రింబవళ్ళు అరిచే నన్ను చూసి విసుగెత్తి
నన్ను లేపకుండానే వెళ్ళిపోయింది, శత్రువుకు చెయ్యందించింది

పాట దగ్గరికి కోయిల రాయబారం వెళ్ళింది
నియంతలపై విప్లవ సాహిత్యం నిప్పులు కురిపించాల్సిన అవశ్యకతను వివరించింది
లాలించింది, బుజ్జగించింది, బెదిరించింది
యిరుకున పడ్డ పాట ఎగిరి శత్రువుతో కలిసింది
యిప్పుడు నేను ఒంటరిని, కాలం చెల్లిన నియంతని
నేను బహిష్కరించిన వారంతా నన్ను బహిష్కరించారు
నేను నిషేధించిన వారంతా నన్ను నిషేధించారు
సహజంగానే చివరికి వారే గెలిచారు
ఎప్పటిలాగే చరిత్రలో నేనే వోడాను
నా శత్రువులు సంబరాలు జరుపుకున్నారు
నేను ఆత్మహత్య చేసుకున్నాను
నియంతలు హంతకులేకాదు, పిరికిపందలు కూడా
అవును నేను పిరికి పందని

—రివేరా

# ప్రేమించొద్దు ద్వేషించండి

[50 ఏళ్ళ స్వాతంత్ర్యం స్త్రీలకు, దళితులకు, ముస్లింలకు, ఆదివాసీలకు ఏమిచ్చింది అనే సమస్యపై విజయవాడలో సెప్టెంబర్ 13, 14 తేదీలలో విరసం నిర్వహించిన సదస్సులో చదివిన కవిత.]

ఈ దేశంలో ఉన్న అన్ని వర్గాల ప్రజలకంటే అన్ని కులాల కంటే అణిచివేయబడిన వాళ్ళం, అణగదొక్కబడిన వాళ్ళం. మేం నవ్వితే అనుమానం, మా నడకమీద అనుమానం, పెళ్ళికాకుండా చస్తే అనుమానం, పెళ్ళికాకపోతే అవమానం, పెళ్ళి చేసుకున్నా అనుమానమే, అంక్షలే, మాలాంటి అణచబడిన వర్గాల ఈ సమాజంలో ఏమీ పొందలేం. "ప్రేమ"లు అభిమానాలు, ఆప్యాయతలు అన్నీ అందని ద్రాక్షపళ్ళే. మేం యంత్రాలం పనిచేసే యంత్రాలం. ఎక్కడ చూసినా మేమే. ఇంటిలో మేమే, ఆఫీసుల్లో మేమే, ఫ్యాక్టరీల్లో మేమే, పొలాల్లో మేమే, గనుల్లో మేమే, కొండల్లో మేమే, కోనల్లో మేమే, అడవిలో మేమే, యంత్రాలం పనిచేసే యంత్రాలం. అదనంగా పిల్లల్నికనే యంత్రాలం. మాకు అనుభూతులు లేవు, ఆలోచనలు లేవు, అభిప్రాయాలు లేవు, కోరికలు లేవు. ఒక నిప్పు కులస్థుడు గానీ

దళితుడు గానీ ఒక భూస్వామికి కాళ్ల పడతాడు, చెప్పులు తుడుస్తాడు, వంగి వంగి దండాలు పెడుతాడు. ఇంటికి వచ్చి కూర బాగా లేదనో ఉప్పు చాల్లేదనో తన భార్యని చెప్పుకాలితో ఎగిరి డొక్కల్లో తంతాడు. అతనికి ఆ శక్తిని, ఆధిక్యతను ఈ వ్యవస్థ ఇచ్చింది.

సమాజంలో అట్టడుగు స్థాయిలో నిలచిన, అణగదొక్కబడిన మాకు ఒక వేదిక కల్పించి, మొట్టమొదటిరోజే మొదటి సెషన్‌లో మా సమస్యను చర్చించి, మాకు క్రొత్త ఆలోచనలు కల్పించి సమస్యలకు పరిష్కార మార్గాలను చెప్పి మాకు బతుకు మీద ఆశ కల్పించి, మా ఆలోచనలను, అనుభూతులను పంచుకున్న "విరసం"కు ముందుగా ధన్యవాదాలు తెలియజేస్తూ నా కవిత చదువుతాను.

ఈ కుళ్ల సమాజంలో అన్నీ కల్తీనే, వస్తువులు కల్తీ, మనుషులు కల్తీ, మనస్సులు కల్తీ, 'ప్రేమ'లూ కల్తీ. ప్రేమను ప్రేమించండి, వంచన చేయొద్దు, కల్తీ చేయొద్దు, 'ప్రేమ'ను బ్రతికించండి !!

ప్రేమించొద్దు ద్వేషించండి
ప్రేమను ప్రేమించడం చేతకానప్పుడు ప్రేమ నటించొద్దు
నేను చచ్చిపోతే ఏడ్వకండి
మీరేడ్చినట్టు నటిస్తే నేను మరోసారి చచ్చిపోతాను
మీరేం బాధపడకండి నాకోసం
నిర్జీవమైన నా శరీరాన్ని
ప్రేమతో ఆర్తితో హృదయానికి హత్తుకొని
ప్రేమతో నాకోసం రెండు కన్నీటి చుక్కల్ని నిజాయితీగా రాల్చడానికి
నేను ప్రేమించిన వాళ్లు....స్నేహం విలువ తెలిసినవాళ్లు
నా ఆత్మీయులున్నారు....బాధపడకండి
ప్రేమను ప్రేమించడం చేత కానప్పుడు
ప్రేమ నటించొద్దు ద్వేషించండి
నేనిప్పుడు
సూర్యుడికి సెంట్రీ చేస్తున్నాను !
జాబిల్లిని చూసి వెన్నెల్ని ఎలా కురిపించాలో నేర్చుకుంటున్నాను !

—వాణిశ్రీ

# మన స్వారాజ్యం తీరు జూడు

ఆగస్టు అర్ధరాత్రి.... ఓలచ్చ గుమ్మడి
వచ్చినాది స్వాతంత్రం.... నాలచ్చ గుమ్మడి
నాటి నుండి నేటిదాక.... " "
మన స్వారాజ్యం తీరుజూడు " "

నిరుద్యోగం పెరిగింది.... ఓలచ్చ గుమ్మడి
నీటిచుక్క తగ్గింది.... నాలచ్చ గుమ్మడి
అంటరానితనం పెరిగె.... " "
అవినీతి అధికమాయే.... " "

భూస్వాముల చేతుల్లోన.... ఓలచ్చ గుమ్మడి
భూములన్ని భద్రంగుండి.... నాలచ్చ గుమ్మడి
దుక్కిదున్ని దమ్ముచేసే.... " "
రైతు కూలికి భూమి లేదు.... " "

సంతలోని సరుకులన్ని.... ఓలచ్చ గుమ్మడి
సర్రు సర్రున కాలబట్టి.... నాలచ్చ గుమ్మడి
ధరల మీద ధరలు పెంచి.... " "
దండుకోసి బతుకుతుండ్రు.... " "

కరువు కాటకాలతోటి.... ఓలచ్చ గుమ్మడి
తల్లడిల్లు కాలమాయే.... నాలచ్చ గుమ్మడి
బీద బిక్కి జనం అంత.... " "
బాదలతో చావబట్టె.... " "

ఆడవాల్ల బతుకులన్ని.... ఓలచ్చ గుమ్మడి
అంగట్లలోని బొమ్మనుచేసి.... " "
అందాల పోటీలంటు.... " "
కామానికి కోరలు పెంచే.... " "

గాంధీ తాత భక్తులమంటు....ఓలచ్చ గుమ్మడి
బ్రాందిషాపులు మల్లి తెచ్చి.... " "
పల్లెనుండి ఢిల్లీ దాక " "
సారాయి సర్కారాయే " "

విల్లుబట్టిన అల్లూరిని.... ఓలచ్చ గుమ్మడి
బందిపోటు దొంగన్నారు.... నాలచ్చ గుమ్మడి
భగత్‌సింగ్ బాంబువేస్తే.... " "
ఉరితీసి చంపినారు.... " "

మనకొచ్చిన స్వాతంత్ర్యం.... ఓలచ్చగుమ్మడి
మేడిపండు చందమాయే.... నాలచ్చ గుమ్మడి
మన దారిద్ర్యం తీరు జూస్తే.... " "
అది రాచపుండు తీరు పెరిగె

50 ఏండ్ల స్వారాజ్యం.... ఓలచ్చ గుమ్మడి
చిప్ప చేతికిచ్చినాది.... " "
మూడు రంగుల జెండ నేడు " "
బిచ్చమెత్తె జోలేఆయే " "

స్వాతంత్ర దేశమాని.... ఓలచ్చ గుమ్మడి
సంబరాలు చేసుకోకు.... " "
పరాధీన భారతాన్ని " "
స్వాతంత్రంగా చేద్దాము " "

–ఉప్పెన

---



---

నడుస్తున్న చరిత్ర

# మాదిగ దండోరా : దళితుల ఐక్యత

చాలా ఏళ్ళనుండి, చాలా సందర్భాల్లో నలుగుతూ వచ్చిన 'రిజర్వేషన్ల సమస్య' మాదిగ రిజర్వేషన్ పోరాట సమితి ఉద్యమం చేపట్టాక మరింతగా చర్చనీయాంశమైంది. అయితే గతంలో జరిగిన ఉద్యమాలకూ..... మాదిగ రిజర్వేషన్ పోరాట సమితి (యం.ఆర్.పి.యస్.) ఉద్యమానికీ చాలానే తేడా ఉంది. సమస్య స్థూలంగా బైటికి ఒకే అంశంలాగా కనిపించినా, సందర్భాన్ని బట్టి కొత కొత్త కోణాలు కాంతివంతమవుతూ ఉంటాయి. కొత్త చైతన్యాలు ముందుకు వచ్చి చరిత్రలో నమోదు అవుతుంటాయి. ఇదంతా ఎక్కడో ఒకచోట వ్యవస్థను ధిక్కరించే శక్తిగా సమీకృతమవుతూ వుంటుంది.

గతంలో బి.సి. కులాల రిజర్వేషన్లను 25 శాతం నుండి 44 శాతానికి పెంచినప్పుడు వి.పి. సింగ్ కాలంలో మండల్ సిఫారసుల మేరకు ఉద్యోగాల్లో వెనుకబడిన కులాలకు 27 శాతం రిజర్వేషన్లు కల్పించాలని ప్రకటించినప్పుడు రిజర్వేషన్లపై పెద్ద ఎత్తున ఆందోళనలు జరిగాయి. విస్తృతంగా చర్చలు జరిగాయి. ఆ యా సందర్భాల్లో రిజర్వేషన్ ప్రతిపాదనలను వ్యతిరేకిస్తూ అగ్రకులాలవాళ్ళు, పై వర్గాలవాళ్ళు ఉద్యమాలు చేపట్టారు. వీటిని తిప్పికొడుతూ పీడిత కులాలు రిజర్వేషన్ పరిరక్షణ కోసం దేశవ్యాప్తంగా ఆందోళన నిర్మించాయి. అప్పటి ఉద్యమాల్లో ప్రధానంగా విద్యార్థులు, యువకులు, బుద్ధిజీవులు కీలకంగా పనిచేశారు.

వీటితో పోల్చితే యం.ఆర్.పి.యస్. ఉద్యమానికి ఒక ప్రత్యేకత వుంది. యస్సీలకు కేటాయించిన రిజర్వేషన్ల ఉమ్మడి విధానాన్ని వ్యతిరేకిస్తూ 'మాదిగ దండోరా' మోగింది. జనాభా ప్రాతిపదిక పైన మాదిగలకు రిజర్వేషన్లు కేటాయించాలని గత మూడు సంవత్సరాలుగా రాష్ట్రవ్యాప్త ప్రజా ఉద్యమం నడుస్తున్నది.

మారుమూల మాదిగ వాడలనుండి వేలాదిగా, లక్షలాదిగా మాదిగలు వీధుల్లోకి వచ్చారు. సముద్రంలాగా నగరాన్ని చుట్టుముట్టి కులసమస్యపై నంగినంగిగా మాట్లాడే వారంతా ముసుగులు లాగి వాళ్ళ వీపు చరిచింది. అందరి దృష్టిని తనవైపు తిప్పుకోగలిగింది. దాదాపు మూడేళ్ళ సుదీర్ఘ పోరాటం తర్వాత రాష్ట్ర ప్రభుత్వం విధి లేక యస్సీ రిజర్వేషన్లను యం.ఆర్.పి.యస్. డిమాండ్ మేరకు ఎ,బి,సి,డిలుగా విభజిస్తూ నిర్ణయం ప్రకటించింది.

ఇదే సందర్భంలో మాదిగల ఉద్యమానికి విపరీతంగా ప్రతిస్పందిస్తూ' మాలలు ఎ, బి, సి, డి విభజనకు వ్యతిరేకంగా ఆందోళనకు దిగారు. మాల మహానాడు' మాల హక్కుల పరిరక్షణ సమితి పేర్లతో సంఘాలను ఏర్పాటు చేశారు. రిజర్వేషన్ విభజన వల్ల 'దళిత కులాల్లో ఐక్యత దెబ్బతింటుందని వీళ్ళు వాదిస్తున్నారు. బైటికి ఈ మాట అంటున్నప్పటికి మాలనాయకులు మాదిగ వ్యతిరేకతను క్రమతిమించి ప్రచారం చేస్తున్నారు. మాలలను మాదిగలను రెచ్చ కొట్టడానికి మాల నాయకత్వం పూనుకోవడం విచారకరం. మాల సంఘాలు, సభలు, సదస్సులు, ర్యాలీలు నిర్వహించడమే గాక రిజర్వేషన్ విభజనపై ప్రభుత్వ నిర్ణయాన్ని సవాల్ చేస్తూ కోర్టుకు కూడా వెళ్ళారు. ఏది ఏమైనా రిజర్వేషన్ల విభజన అమలు చేస్తామని ముఖ్యమంత్రి అంటున్నప్పటికీ ప్రస్తుతం సమస్య కోర్టులో దశల వారీగా నడుస్తున్నది. గతంలో నడిచిన రిజర్వేషన్ ఉద్యమాలకు విద్యార్థులు, యువతీ యువకులు, పట్టణ ప్రాంతాలు స్థూలమైన పరిమితిగా చెప్పుకోవచ్చు. ఇవి స్పష్టంగా అగ్రకులాలకు, పీడిత కులాలకు మధ్య నడిచాయి. యస్సీలకు కేటాయించిన రిజర్వేషన్లలో కుల ప్రాతిపదికన మాల, మాదిగ తదితర కులాలకు విభజించి కేటాయించమని యం.ఆర్.పి.యస్. డిమాండ్ చేయడంతో మాల మాదిగ కులాల మధ్య విభేదాలు తలెత్తాయి. ప్రారంభ దశలో మాలలు రిజర్వేషన్ల అనుభవంలో మాదిగలకు అన్యాయం చేస్తూ వచ్చారని యం.ఆర్.పి.యస్. మాలల అభివృద్ధిని భూతద్దంలో చూపిస్తూ, వాళ్ళు ఏ యే ఉన్నత స్థానాలకు ఎట్లా ఎదిగిందీ చెప్తూ వచ్చారు. రిజర్వేషన్లను అనుభవించడంలో తేడా ఉన్న మాట నిజమేగాని, ఆ చెప్పే మాట మాలలకు గురిపెట్టినట్టుగా........ కనీసం మాలలయినా అభిప్రాయ పడే అవకాశం ఏర్పడింది. ప్రారంభంలో ఒక ఉద్యమం పూర్తి అవగాహనతో, పూర్తి సంయమనంతో వ్యవహరించటం సాధ్యం కాదు కూడా. తర్వాత ఈ వైఖరిలో మార్పు వచ్చింది.

మాల నాయకులు కూడా మాదిగ వ్యతిరేకతను రెచ్చగొడ్తూ ఉద్యమాలు ప్రారంభించారు. యం.ఆర్.పి.యస్. ఉద్యమం డిమాండ్ పరిమితమైనదిగా ఉన్నప్పటికీ....దానికన్న నిర్దిష్టత రీత్యా అది గతంలో జరిగిన రిజర్వేషన్, దళిత పోరాటాల కంటే ఎక్కువ కదలిక తీసుకొచ్చింది.

ఒక్క మాటలో చెప్పాలంటే, సమస్య రిజర్వేషన్లే అయినప్పటికీ గత ఉద్యమాల కంటే దీనికి విస్తృత స్థాయిలో స్పందనలు కలిగాయి. డిమాండ్

ప్రధానంగా విద్యా ఉద్యోగ రంగాలకు సంబంధించిన రిజర్వేషన్ల సమస్య అయిన ప్పటికీ గ్రామీణ ప్రాంతం నుండి లక్షలాదిగా మాదిగలు నిర్మాణాల్లోకి వచ్చారు. పోరాటాల్లో ముందుకు కదిలారు. ఈ ఉద్యమం మాదిగల చైతన్య స్థాయిని ఎంతగా పెంచిందో, మాల మాదిగల వైషమ్యాలను కూడా అంతగానే పెంచిన మాట వాస్తవం. మరి కారణాన్ని మాదిగల డిమాండ్‌లో చూడటం అప్రజాస్వామికం. అట్లాంటి నిర్ణయానికి రాకుండా ఉండేందుకైనా, గ్రామీణ ప్రాంతాల్లో మాల మాదిగ వైషమ్యాలు క్రమంగా పెరిగిపోకుండా దళితులను సమైక్యంగా అగ్రకులాలకు, సంపన్న వర్గాలకు వ్యతిరేకంగా ఉద్యమాల్లో సమీకృతం చేసుకోవడానికైనా సమస్యను సాధ్యమైనంత లోతుగా ఆలోచించవలసి ఉంటుంది.

దీనికిగాను.... కొన్ని విషయాలపై స్పష్టమైన అవగాహనను ప్రచారం చేయవలసి ఉంది. యం.ఆర్.పి.యస్. డిమాండ్ న్యాయబద్ధతను సహేతుకంగా వివరించడం; మాలమాదిగల వైరుధ్యాన్ని మొత్తం భారతదేశ కులవ్యవస్థలో భాగంగా చూసి, దాన్ని మిత్రపూరితంగా ఎలా అర్థం చేసుకోవాలో వివరించడం; అన్ని రంగాల్లో అన్ని రకాల అభివృద్ధిలో సాపేక్షమైన తేడాలతో మాదిగలు, మాలలు ఎట్లా అణిచివేతకు గురవుతున్నదీ చెప్పి, యస్సీలు, బీసీలు అగ్రకులాలకు, కులవ్యవస్థకు వ్యతిరేకంగా కుల నిర్మూలన కోసం ఉద్యమించాల్సిన అవసరం నొక్కి చెప్పడం; చట్ట పరిధిలో సంస్కరణల పరిధిలోని అభివృద్ధి కోసం రిజర్వేషన్లను హక్కుగా గుర్తిస్తూనే వాటి పరిమితి చెప్పి 'దున్నేవారికే భూమి' ప్రాతిపదికపై భూమిలేని రైతాంగంతో కలిసి, పీడితులందరితో కలిపి (భూమిలేని వ్యవసాయ కూలీలు ఎక్కువ మంది దళితులే) రాజ్యాధికారం కోసం పోరాడాల్సిన అవసరం వివరించడం........చాలా అవసరం.

భారతదేశం కులవర్గ సమాజం. బైటి దేశాల్లోలాగా కేవలం ధనిక పేద వర్గాలు మాత్రమేగాక ఇక్కడ అనేక కులాలు కూడా ఉన్నాయి. ఇవి ఒక నిచ్చెన మెట్ల నిర్మాణాన్ని కలిగి ఉన్నాయి. దీనికి ఆర్థిక రాజకీయ సాంఘిక సాంస్కృతిక ఆధారాలున్నాయి. ఈ నిర్మాణాలలో అధికారం ఒక ప్రధానాంశం. సమాజాన్ని శాసించడంలో, కంట్రోల్ చేయడంలో కులవ్యవస్థ కీలకపాత్ర వహిస్తున్నది. సకల ఉత్పత్తి సాధనాలను తమ చేతిలో పెట్టుకోవడం వలన అగ్రకులాలు పరిపాలనా రంగంలో విద్యా ఉద్యోగ రంగాలతో బాటు సాంస్కృతికంగా కూడా అధికారాన్ని

చెలాయించగలుగుతున్నారు. నిజానికి ఉత్పత్తి సాధనాలయిన భూమి వగైరాలను కైవసం చేసుకోవడమే గాక, కులవ్యవస్థ తనదైన ఒక భావజాలాన్నీ, ఆలోచనా విధానాన్నీ, సాంఘిక కట్టుబాట్లనూ, సంస్కృత సాంప్రదాయాలనూ ఏర్పరచడంతో సమస్త అధికారాలు, సుఖాలు అగ్రకులాల సొంతమై పోయాయి. వాటి కింద దళితులు, వెనుకబడిన కులాలు అణగారిపోతున్నాయి.

ఈ నిచ్చెన మెట్ల నిర్మాణంలో ఉన్న కులాల మధ్య వైరుధ్యం ఉంది. వర్ణ వ్యవస్థలో ఇది ఒక నిర్దిష్ట లక్షణం. ప్రజలను విడి విడి చట్రాల్లో ఇమడ్చడం ద్వారా సమాజాన్ని విభజించి, పీడనను, అణచివేతను యథాతథం చేయగలిగింది. కులాల మధ్య వైరుధ్యాలు శ్రామికులందరినీ ఏకం కాకుండా పని చేస్తుంటాయి. ఇవి అన్ని రకాలుగా సామాజికమవుతున్న క్రమం ఒకటుంటుంది. ఏ రెండు పీడిత కులాల మధ్య అయినా ఇది నిర్దిష్టంగా ఉంటుంది. మాల, మాదిగ కులాల మధ్య ఉన్న వైరుధ్యం అలాంటిదే.

కుల సామాజిక వ్యవస్థలో పై కులాలకూ, కింది కులాలకూ మధ్య ఉన్న వైరుధ్యానికీ, కింది కులాల్లోనే ఉండే వైరుధ్యాలకూ మధ్య చాలా తేడా ఉంది. ఈ రెండు సందర్భాల్లో కనిపించే వైరుధ్యాలకు స్వభావరీత్యానే తేడా ఉంది. కింది కులాల మధ్య వైరుధ్యాలు బలపడి అవి సామాజికమైన ఒక క్రమంగా నిర్దిష్టంగా చెప్పుకోగలిగితే బైటికి ఆ వైరుధ్యాలు ఎంత తీవ్రంగా కనిపిస్తున్నప్పటికీ వాటి మిత్ర స్వభావం అర్థమవుతుంది.

స్థూలంగా చెప్పుకుంటే రాష్ట్రం మొత్తం మీద మాదిగలు మాలలకంటే వెనుకబడి ఉన్నారు. సంపద సృష్టించడంలో ప్రధాన భాగస్వామ్యం ఉన్న మాల మాదిగలకు ఉత్పత్తి రంగంతో ఉన్న సంబంధాన్ని బట్టి, ఉత్పత్తిలో ఆ కులాలు పాల్గొంటున్న పద్ధతిని బట్టీ వాటి స్థితిగతులు వుంటాయి. వర్ణ వ్యవస్థ విధి నియమాల క్రమంలో (చారిత్రకంగా చూస్తే ఇవి చాలా రకాలయిన పరిణామాలకి గురయినట్టు తెలుస్తుంది.) మాలలు కొన్ని ప్రాంతాల్లో నేత వృత్తిలో కొనసాగుతూ వచ్చారు. మరికొన్ని ప్రాంతాల్లో వ్యవసాయ కూలీలుగా వుండేవారు. వలస పాలన ప్రారంభమయ్యాక దేశంలోని స్వయం గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో చాలా మార్పులు జరిగాయి. ఇవి చేతివృత్తుల వ్యవస్థలో ప్రభావం చూపాయి. చేనేత ఒక కుటీర పరిశ్రమగా, కుల వృత్తిగా గ్రామీణ ఆర్థిక రంగంలో కీలకపాత్ర వహిస్తూ వచ్చింది.

చేనేత వ్యవస్థలోకి వలసపాలకుల విధానం ప్రవేశించాక మాల, సాలె కులాల నేత పనులు దెబ్బతిన్నాయి.

ఇది కూడా ఒక కారణంగా మాలలు వ్యవసాయ కూలీలుగానూ, కొత్తగా వెలుస్తున్న పారిశ్రామిక ప్రాంతాల్లో కార్మికులుగానూ మిగిలిపోయారు. ఇది మను ధర్మ వ్యవస్థలో, కుల వ్యవస్థలో సామాజిక పరిణామంలో భాగంగా జరుగుతూ వచ్చిన మార్పుకు ఉదాహరణ. పాత గ్రామీణ ఆర్థిక విధానం స్థానే కొత్త విధానాలు ప్రవేశించినపుడు, ఉత్పత్తి విధానంలో జరిగే ఏ రకమైన మార్పులయినా, కుల వ్యవస్థ తాలూకు చట్రంలో మార్పులు తేగలిగాయి.

అలా కుల నిర్మాణం నుండి, కట్టుబాట్ల నుండి మాల కులం చిన్న కదలికకు గురయినట్టు అర్థమవుతుంది. ఇది కొంతయినా మాలల అభివృద్ధికి దోహదపడిందని చెప్పవచ్చు.

దీని ఫలితంగా దళిత కులాల్లో మొట్టమొదట అక్షరజ్ఞానానికి మాల కులమే కొంతయినా దగ్గర కాగలిగింది. దీనితో పోల్చుకుంటే మాదిగల్లో అక్షరాస్యత ఇప్పటికీ చాలా తక్కువ. ఇది మాదిగల సాపేక్షమైన వెనుకబాటుతనానికి కారణమైంది. అయితే మాలల్లో జరిగిన అభివృద్ధికి వాళ్ళ జీవిత సారాంశంలో మౌలికమైన మార్పు తీసుకురావడం సాధ్యం కాకపోయినా, విద్యారంగంలోని రిజర్వేషన్లు స్వల్ప స్థాయి మార్పుకు దోహదపడిన మాట నిజం.

మాదిగల స్థితి ఇందుకు పూర్తిగా భిన్నమైంది. దాదాపు రాష్ట్రంలోని అన్ని ప్రాంతాల్లో మాదిగలకు కుల వ్యవస్థ నిర్దేశించిన కులవృత్తి ఒకటుంది. తోలు పనులు, ఊళ్ళో మంచికీ చెడుకూ తప్పెట వాయించటం, అశుద్ధ పనులు చేయడం మాదిగల వృత్తిగా వుండేది. నిజానికి ఇవ్వాల్టికీ గ్రామాల్లో మాదిగలు ఈ వృత్తిలో ఎక్కువ శాతం కొనసాగుతున్నారు. దీనివల్ల మాదిగలపై అస్పృశ్యత దారుణంగా ఉంది. ఎంతగానంటే మాలలు కూడా ఇంట్లోకి రానివ్వనంతగా, మంచి నీళ్ళ గ్లాసుతో ఇవ్వనంతగా మాదిగలు అస్పృశ్యతా భారాన్ని మోస్తూ వెలివేయబడ్డారు.

ఒక పక్క సాంఘికంగా అస్పృశ్యత, మరోపక్క గ్రామీణ ప్రాంతాల్లో వ్యవసాయం, సంస్కృతి సేవా రంగాలన్నింటా మాదిగల పాత్ర ఉండటంతో కుల వ్యవస్థలో తమ స్థానం నుండి మాదిగలు కొంచెం కూడా బైటపడటం సాధ్యం కాలేదు. నిచ్చెన మెట్ల నిర్మాణంలో పూర్తి అట్టడుగున ఉన్న మాదిగలను ఏ

చిన్న కదలిక కూడా స్పృశించలేదని చెప్పవచ్చు.- వున్నా.... అది మాలలతో పోల్చుకుంటేనే చాలా స్వల్పం. ఈ మొత్తాన్ని భారత దేశానికున్న నిర్దిష్ట లక్షణాలలో కులాల రీత్యా 'శ్రమ విభజన-శ్రామికుల విభజన' అనే వాస్తవిక దృష్టి కోణంతో పరిశీలిస్తే మాల-మాదిగ కులాల మధ్య వున్న వైరుధ్యం స్పష్టమవుతుంది. మాలల్లో జరిగిన కొద్దిపాటి అభివృద్ధిగాని, మాల మాదిగ కులాలకు వున్న వైరుధ్యంగాని కుల సామాజిక నిర్మాణానికి లోబడినవే. దాని ప్రభావంతో ఉనికిలో ఉన్నవే. వివిధ రంగాలలో దళితుల జీవితంలో రిజర్వేషన్ల పాత్ర గుర్తించడానికి నలభై యాభై యేళ్ళుగా మాలల అభివృద్ధినీ, మాదిగల వెనుకబాటుతనాన్నీ లెక్కలు తీస్తే స్పష్టమవుతుంది. ఉమ్మడి రిజర్వేషన్ల అనుభవంలో సమానస్థాయి లేకపోవడం వల్ల యస్సీల రిజర్వేషన్లు ఎక్కువగా మాలలకే అందుబాటులోకి వచ్చాయి. ఈ విషయం గురించి యం.ఆర్.పి.యస్ గణాంక వివరాలను కూడా తన వాదనకు బలంగా ప్రకటిస్తున్నది. ఇది ప్రగతిశీల భావాలున్న వాళ్ళకు వాద వివాదాలకు తావులేని సత్యం. అయితే ఈ వాస్తవం ముందుకు వచ్చినప్పుడు స్పందించే తీరు, మాట్లాడే తీరు, ఉద్యమం నడిపే తీరు గురించి ఎక్కువగా చర్చించుకోవలసి వచ్చింది.

ఎప్పుడైనాగాని, ఎవరైనాగాని మాదిగ నాయకులు మాలలు కుట్రజేసి రిజర్వేషన్లు కాజేశారని అంటే దాన్ని వ్యతిరేకించాల్సిందే. నిజానికి మాల నాయకులే ఈ వేళ మాదిగ వ్యతిరేకతను కుట్రపూరితంగా రెచ్చగొడుతున్నారు. దీనికిగాను వాదనలో వాళ్లు ముందు పెడుతున్న విషయాలు ఎంతమాత్రం నిలబడేవి కాదు. ఉమ్మడి రిజర్వేషన్ల వర్గీకరణ వలన దళితుల్లో ఐక్యత దెబ్బతింటుందని మాల నాయకులు అంటున్నారు. పైకి చూడ్డానికి ఈ మాట చాలా బాగుంటుందిగాని, లోతుల్లోకి చూస్తే మాదిగల డిమాండయిన వర్గీకరణను వ్యతిరేకించడమే దీని ఉద్దేశమని అర్థమవుతుంది.

నిచ్చెనమెట్ల నిర్మాణంలోగాని, చారిత్రకంగా గాని మాలలు మాదిగలు పరిసమానంగా ఉండడం సాధ్యం కాలేదు. మనకు అవగాహనలోకి వచ్చిన చరిత్ర వరకు చూస్తే కూడా ఇది నిజమని తేలుతుంది. ఎందుకంటే అది వర్ణ వ్యవస్థ స్వభావం కాబట్టి. ఏ రెండు కులాల మధ్యగాని, సెక్షన్ల మధ్యగాని ఉండే అసమానత సామాజికాంశం. దానికి స్పష్టమైన, ఖచ్చితమైన భౌతిక పునాది వుంటుంది.

దాన్ని దెబ్బ తీయకుండా మనం ఏ ఉద్దేశాలతో ఏ మాట అన్నా, ఏ ఆదర్శాలతో ఏవేవో ఊహించుకున్నా అవన్నీ కేవలం ఊహలకే పరిమితమవుతాయి. ఆ భౌతిక ఆధారాన్ని దెబ్బతీయడానికి అనేక స్థాయిల్లో, అనేక రూపాల్లో పోరాటాలు అవసరం ఆ ఆధారంగానీ, పోరాట రూపాలుగానీ నిర్దిష్టంగా ఉంటాయి.

ఇది నిర్దిష్టతల గురించి సీరియస్‌గా చర్చిస్తున్న కాలం. ప్రతి నిర్దిష్టతనూ పట్టించుకొని, దానికున్న భౌతిక ఆధారాన్ని, అందులోని వైరుధ్యాల సమస్యనూ చర్చించి పోరాట క్రమంలో పరిష్కరించవలసి ఉంటుంది. అయితే ఒక సామాజి కాంశంగా కులవ్యవస్థ లోని నిర్దిష్టత ఏమంటే, అన్ని పీడిత దళిత కులాలకూ, అగ్రకులాలకూ మధ్య ఉన్న వైరుధ్యం దానికి వున్నభౌతిక పునాది. ఈ వైరుధ్యం ప్రాథమికమైనది, శత్రుపూరితమైనది. మిగతా అన్నీ దళిత పీడిత కులాల మధ్య వున్న వైరుధ్యాలు మిత్ర పూరితమైనవి. ఇలాంటి ప్రతి చిన్న వైరుధ్యాన్ని వెతికి పట్టుకొని చైతన్యవంతంగా పరిష్కరించే ప్రయత్నం చేయాలి. ఆ ప్రయత్నం చేస్తున్నామంటే, దాని డైరెక్షన్ ప్రధాన వైరుధ్యం దిశగా, దాన్ని పరిష్కరించే స్పృహతో ఉండాలి. లేకపోతే అగ్రకుల భావజాలాన్ని మనమూ మోస్తూ, వాళ్ళ ప్రయోజనాలు నెరవేర్చిన వాళ్ళమవుతాం. సారాంశంలో అగ్రకులాల ఉనికి పదిలంగా ఉంటుంది. కుల వ్యవస్థ శ్రామికులను చీల్చి, వేర్వేరు కులాల అంతరా ల్లోకీ, వైరుధ్యాల్లోకి నెట్టివేసిందని చెప్పుకుంటున్నాం కాబట్టి ఆ వైరుధ్యాల్లోని మిత్రత్వాన్నీ చైతన్యవంతంగా అర్థం చేసుకొని దళిత కులాల సమగ్ర అభివృద్ధి దిశగా నడవడం అంటే అది కుల వ్యవస్థకు వ్యతిరేకంగా దళితులందరినీ ఒక్కటిగా ఆర్గనైజ్ చేయడమే. అలా దళిత కులాల్లోని వైరుధ్యాల పరిష్కారం దళితుల ఈ చైతన్యవంతమైన అభివృద్ధి అనివార్యంగా అగ్రకుల వ్యవస్థతో తలపడ్డంగా పరిణామం చెందితే మొత్తం కులవ్యవస్థ పునాదు లే కదులుతున్నట్టు లెక్క.

అలాగాక యం.ఆర్.పి.యస్. డిమాండ్‌లాంటి వాటిని ప్రగతిశీల భావాలతో పరిష్కరించకపోయినా, అసమానుల మధ్య ఐక్యతను కోరుకొని ఆ డిమాండును వ్యతిరేకించినా అంతిమంగా కులవ్యవస్థ పునాదిని బలపరిచి నట్టవుతుంది. దళితులు హక్కుల కోసం పోరాడినప్పుడల్లా పాలక వర్గాలు, అగ్రకులాలు రాజ్యాంగంలోని "అందరూ సమానమే" అనే విషయం గుర్తు తెచ్చి దళితుల న్యాయబద్ధమైన ఆకాం క్షను రద్దు చేయాలనుకొన్న సందర్భాలు కోకొల్లలుగా వున్నాయి. ఇవాళ దళితుల్లో

కూడా మాదిగలు తమ న్యాయమైన డిమాండు ముందుకు తెచ్చినపుడు మాల నాయకులైనా, మరెవరైనా ఈ ఐక్యతవాదాన్ని పోటీగా తేవడమంటే అగ్రకుల భావజాలానికి మనమూ ప్రతినిధులమయినట్టే. యం.ఆర్.పి.యస్.ను ఏ రూపంలో వ్యతిరేకించే వాళ్ళయినా సరే, వాళ్ళు యింకో వాదన కూడా తెస్తున్నారు. దళితుల ఐక్యతను కాపాడేందుకు రిజర్వేషన్లు ఉమ్మడిగానే ఉండాలి, ప్రతిభ ఉంటే మాదిగలు తమ వాటా రిజర్వేషన్లు అనుభవించవచ్చు అని అనడం దారుణమైన వాదన. అణగారిన కులాల, వర్గాల అభివృద్ధిని అడ్డుకోవడానికి ఇంతకన్నా మనుధర్మ నీతి మరొకటి ఉండదు. ఈ వాస్తవాలన్నింటిని మాల ప్రజలు అర్థం చేసుకొని ఉమ్మడి రిజర్వేషన్‌కు ఉన్న జనాభా ప్రాతిపదికను అంగీకరించి, మాదిగల న్యాయబద్ధమైన డిమాండ్‌ను బలపరచవలసి వుంది. వర్గీకరణ వ్యతిరేక ఆందోళనలోని అసలు ఉద్దేశాన్ని గమనించి ప్రత్యక్షంగాగాని, పరోక్షంగాగాని అగ్రకుల వ్యవస్థకు ఉపయోగపడే పొరపాటు జరగకుండా జాగ్రత్త తీసుకోవలసి ఉంది. నిజమైన అర్థంలో దళితుల ఐక్యతను కోరుకోవడమంటే వర్గీకరణ డిమాండ్‌ను అంగీకరించడమే.

సమాజంలో ఏ నిర్దిష్టాంశమూ విడిగా ఉండదని, ప్రతిదీ మరొకదానితో సంబంధంలో ఉంటూ, దానిని ప్రభావితం చేస్తూ, దానినుండి తాను ప్రభావితం అవుతూ ఉండడం ద్వారానే ఉనికిని సంపాదించుకుంటుందనేది శాస్త్రీయ విశ్లేషణ. కులం ఒక నిర్దిష్టాంశంగా వున్నమాట నిజమేగాని, ఇది ఇతర అనేక సామాజిక పునాదులతో కలగలిసి ఉంటుంది. రిజర్వేషన్ల ద్వారా, సంస్కరణలద్వారా దళితుల జీవితంలో సమూలమైన మార్పు రానట్టే, కులాన్ని మాత్రమే లక్ష్యంగా పెట్టుకున్న పోరాటాలద్వారా కూడా కుల నిర్మూలన పూర్తి అర్థంలో సాధ్యం కాదు.

అంటే రిజర్వేషన్లు చట్టబద్ధమైన అభివృద్ధితోబాటు, భూమి కోసం పోరాటం, రాజ్యాధికారం కోసం పోరాటం దిశగా దళిత చైతన్యం ముందుకు నడిచినప్పుడే వర్గదోపిడీ పీడనల నిర్మూలనలో భాగంగా ఒక నిర్దిష్టాంశమైన కుల నిర్మూలన కూడా ఆచరణ సాధ్యమవుతుంది. వర్గ పోరాటంలో కుల నిర్మూలనకు ప్రధానమైన, స్పష్టమైన స్థానం ఇచ్చినపుడే కుల సామాజిక నిర్మాణాన్ని ఎదుర్కోవడం సాధ్యమవుతుంది.

ఈ దృక్పథం లేకుండా దళిత ఉద్యమాలు ఎంతకాలం నడిచినా, కొన్ని రాయితీలు, హక్కులు సంపాదించుకోగలుగుతాయి గాని, దళిత ప్రజల ప్రబలమైన

ఆకాంక్ష అయిన కుల నిర్మూలన పునాది స్థాయిలో జరగదు. ఒక పక్క సామ్రాజ్య వాద ప్రభావంతో అమలవుతున్న నూతన ఆర్థిక విధానాలు అన్ని రంగాలనూ ప్రైవేటీకరణ వైపుకు నెట్టేస్తున్నాయి. ఈ సందర్భంలో అన్ని రంగాల్లో ప్రైవేట్ సెక్టార్‌తో సహా రిజర్వేషన్లు అమలు చేయాలని డిమాండ్ చేయడమేగాక, ప్రైవేటీకరణనూ వ్యతిరేకించవలసి ఉంటుంది.

ఈ క్రమంలోనే దళిత ఉపకులాల మధ్య ఉన్న మిత్ర వైరుధ్యాలు పరిష్కారం చేసుకుంటూ, అగ్రకుల సంపన్న వర్గాలకూ, సామ్రాజ్యవాదులకూ వ్యతిరేకంగా దళితులందరూ ఏకం కాగలుగుతారు. లేకుంటే చరిత్రలో అనేక సందర్భాల్లో పురివిప్పిన దళిత చైతన్యం, దళిత హక్కుల ఆత్మ గౌరవ పోరాటాలు ఏదో ఒక పేరుతో దారి మళ్ళి పాలక పార్టీలకే సొమ్మయిన దాఖలాలున్నాయి.

అశేష పీడిత మాదిగలందరినీ హక్కుల కోసం, ఆత్మగౌరవం కోసం పోరాటాల్లోకి కదిలించిన 'మాదిగ దండోరా' ఇంకా ఇంకా మాదిగల ఆకాంక్షలకు పోరాట రూపం ఇవ్వవలసి వుంది. నిర్దిష్టతలోకెల్లా నిర్దిష్టతా స్వభావాన్ని సంతరించుకొని అనేక రకాల ప్రశ్నలకు, చర్చలకు కారణమైంది. ఈ చైతన్యాన్ని మాల ప్రజలంతా గట్టిగా బలపరచవలసి వుంది. ఇదంతా గ్రామాల్లో మాలమాదిగ వైషమ్యంగా కాక, నిర్దిష్ట పోరాటాల ప్రజాస్వామిక చైతన్యాలన్నీ ప్రవాహమై అగ్రకుల వ్యవస్థను తుడిచిపెట్టవలసిన చారిత్రక బాధ్యతను స్వీకరించవలసి వుంది.

—సుమ

---

## ఐక్యత

మండల్ చిచ్చుపెట్టి
నీ మనుగడ కాపాడుకున్నానని
అనుకుంటున్నావేమో !
దళిత రిజర్వేషన్ అనైక్యతను చూసి
నవ్వుకుంటున్నావేమో !
ఇక నీ హిందూ భావజాలాన్ని
ముందుకు సాగనివ్వం
మేం విప్లవ పోరాటంలో ఐక్యమై
నీ కపట విలువల్ని ధ్వంసం చేస్తాం.

—నల్లోడు

స్కెచ్

# మా జన్మభూమి గిట్ల గడ్సిపాయె

త్రిగ్గని సోటులేదు....

అడ్గని లీడరు లేదు....

సెయ్యని పనిలేదు....

పడని కష్టం లేదు....

అయ్యా! మా బతుకులిట్ల గాలిపోయె....

బిడ్డోలె జూసుకున్న ఫ్యాక్టరీని, అడ్డదిడ్డంగ లెక్కలేసి, నష్టమొస్తున్నదని మూసేసిరి.... మా బత్కును రోడ్ల మీదేసిరి. ఇజ్జత్‌గ బత్కుతున్న మమ్ముల్ని బే ఇజ్జత్ జేసిరి. మా బతుకుల్ని గిట్ల గూల్చేసిరి....

లోపల ఫ్యాక్టరీల మావోల్లుండిరి. బైట పరేషాన్ల మేముంటిమి. ఫ్యాక్టరీని దెరుస్తరని కొనాశతోని కొట్టుకసస్తున్నము. బిడులు బంద పెట్టిన పోరలేమొ 'అమ్మా! నాయనెప్పుడొస్తడే ఇంటికి?' అని అడ్గుతున్నరు.... గీ మా ఉసురు ఊర్కెపోదు సామీ! మంచి బత్కుల మన్నువోసిరి.

గాయల్ల, ఆగస్టు 1న జన్మభూమి పండుగని, మంత్రిగారు మమ్ముల వల్కరించ వొస్తడని, సంబరపడ్తిమి. తెచ్చిన సద్దుల్ని దెర్వకుండనే ఎదురుసూస్కుంట గూకుంటిమి.

మందీ, మార్బలంతోటి మంత్రిగారొచ్చిరి. లొట లొటా కన్నీరు గార్చి, వట వటా పిట్టకథలు జెప్పిరి. కష్టాలల్ల మా ఎంటుంటనని సేతుల సెయ్యేసి మల్ల మల్ల జెప్పె. తొందర్లనే మాకు మంచి బత్కులొస్తయని (?) మమ్ముల్ని లొల్లి జేయొద్దని, మల్ల మల్ల జెప్పుకుంట మాయమయ్యె....

గాయల్ల అందరము గట్టిగ ఊపిరి బీల్చుకుంటిమి. జన్మభూమి పండుగ ధన్యమయిందని, తిక్కపేగులోల్లాము.... తెగ సంబరపడ్తిమి.... ఈ రోజు పోలీసోల్లు రారన్న ధీమాతో కబుర్లు జెప్పుకుంటిమి....

గాడట్ల వొయ్యిండో లేదో, గీ పక్కనుండి పోలీసోల్లు దుంకిరి. మంత్రిగారు జన్మభూమి ఇనాములు పంపిండేమొనని మేము రిక్కి రిక్కి జూస్తుండగనే, అట్ను తడాఖా జూపిరి. 'కొడుకుల్లార! ఫ్యాక్టరీ మూసేసినాంక స్ట్రయికులు జేస్తారుబే.... ఇచ్చింది దీస్కొని ఇండ్లల్లకు బోక, ఫ్యాక్టరీ లోపల గూకొని నిరాహార దీక్షలు

జేస్తారుబే ! సర్కారంటే లెక్కలేకుండ బోయిందిరా !' అనుకుంట లాఠీలు లేపిన్రు నాయినా !

ఒగమాట ఇనకపోయిరి. ఒగ మనిషిని జూడకపోయిరి. కొట్టుడే కొట్టుడు. ఈడ్సి ఈడ్సి కొట్టిరి.... మెట్లమీద వద్దోల్లను కిందికి ఈడ్సిరి. ఉర్కేటోల్లను జుట్టు వట్టి కొట్టిరి. ఆడోల్లని జూడకుండ గొడ్లను బాదినట్లు బాదిరి. నిరాహార దీక్షలు జేస్తున్నోల్ల సంచుల్లాగ ఎత్తిపడేసిరి. టెంట్ పీకేసిరి.

లాఠీలు రక్తపు రుచి జూసినాంక శాంతికొచ్చినయి.

బయట జన్మభూమి పాటలు బజాయిస్తుంటే మా ఫ్యాక్టరీ లోపలేమొ, ఏడ్పులు, పెడబొబ్బలు....

ఈల్లింట్ల మన్నువొయ్య
ఈల్లింట్ల పీనిగె బొబ్బలెల్ల
ఈల్ల తల్కాయలు గొట్టి ఆకులు గప్ప.
మా ఉసురు ఏడేడు తరాలకు దల్గుతది.
అయ్యో !

బయట జన్మభూమి పండుగ మంచిగ జరిగిందని, గొప్పగ జర్గిందని పేపర్లల్ల, టీవీలల్ల సెప్పుకుంటున్నరంట....

మా జన్మభూమేమో గిట్ల గడ్సిపాయె....

[బతుకుపోరులో ఆల్విన్ కార్మికులకు అంకితం....]

–ఉదయమిత్ర

---

## మొదట మనమే...

ఎవడికి కోపం వచ్చినా మొదట మోగేది మనవీపులే
సారా వచ్చిందంటే కూలిపోతాయి మన కొంపలు
కాపులకు కోపం వచ్చిందంటే కాలిపోతాయి మన గుడిసెలు
న్యాయం కావాలని అడిగితే ఆడతాయి మనమీద పోలీసు లాఠీలు
ఎవడు గెలవాలన్నా రాలిపోతాయి మన తలలు
'కులం' ఉన్నవాడి కంటిచూపుకు
కమిలిపోతాయి మన చెల్లెళ్ళ శరీరాలు
ఏది జరగాలన్నా మనతోనే మొదలవుతుంది
ఏది మార్చాలన్నా మనతోనే మొదలవుతుంది

–రామస్వామి

# వ్యాసం

## టెర్రరిజపు వాస్తవాలను ప్రసార మాధ్యమాలు యెలా వక్రీకరిస్తున్నాయి ?

'హిజబుల్లా', 'హమాస్', 'ముజహిద్దీన్'– ఈ పేర్లు క్రమం తప్పకుండా అంతర్జాతీయ వార్తాపత్రికల, మేగజైన్ల సంపాదకీయాల్లో కనిపిస్తుంటాయి. అలాగే ఆ పేర్లు టెలివిజన్ మరియు రేడియో వార్తలలోనూ నిత్యమూ కన్పడుతుంటాయి, విన్పడుతుంటాయి. అనేకమార్లు గడ్డాలు, మీసాలు, తలపాగాలను ధరించిన పై సంస్థల సభ్యులను అమెరికా మరియు ఇతర ప్రాశ్చాత్య దేశాలకు ప్రియమైన ఉదారవాద నాగరిక విలువలను ధ్వంసం చేయడమే ధ్యేయంగా పెట్టుకున్నవారిగా, ప్రాశ్చాత్య ప్రసార మాధ్యమాలు చిత్రిస్తాయి. ఇస్లాం ప్రపంచానికి సంబంధించిన యే వార్తను ప్రసారం చేసినా, దానిలో వీరిని గురించి వివరణ వుంటుంది. దాంతో, 'జిహద్', 'అల్లాహో అక్బర్' లాంటి పదాలు ప్రాశ్చాత్యుల ప్రత్యేక భాషలో (Lingo) భాగమయ్యాయి.

ప్రపంచంలోని గొప్ప మతాలలో ఒకటైన ఇస్లాంను, నాగరికతా విలువలకు శత్రువుగా చిత్రించడంలో ప్రాశ్చాత్య ప్రసార మాధ్యమాలు (media) వహిస్తున్న పాత్రను ఈ వ్యాసంలో పరిశీలించడం జరిగింది. అందుకుగాను, లెబనాన్‌పై ఇజ్రాయిల్‌పై ఏప్రిల్ 11-27, 1996లో జరిపిన దాడులను ప్రాశ్చాత్య ప్రసార సాధనాలు యెలా చిత్రీకరించాయో విశ్లేషించడమైనది. ఇదొక మచ్చుతునక మాత్రమే.

పై దాడికి వైట్‌హవుస్ (అమెరికా ప్రభుత్వం) సంపూర్ణ మద్దతు నిచ్చింది. వందలాది లెబనాన్ దేశస్థులు మరణించారు. 50 వేల మంది లెబనానీయులు శరణార్థులయ్యారు. 15 సంవత్సరాల అంతర్యుద్ధం తరువాత లెబనాన్ తన రవాణా సౌకర్యాలు, తంతి తపాలాలాంటి మౌళిక రంగాల్ని పునర్నిర్మించుకుంటున్న తరుణంలో జరిగిన ఇజ్రాయిల్ దాడి, తిరిగి లెబనాన్‌ను సర్వనాశనం చేసింది.

పాశ్చాత్య ప్రసార మాధ్యమాలు ఇజ్రాయిల్‌ను పశ్చిమాసియా శాంతి కపోతంగా చిత్రీకరించాయి. అలాంటి శాంతియుత దేశం ఇస్లాం దేశాల ఉగ్రవాద

చర్యల కారణంగా సహనం కోల్పోయి లెబనాన్‌పై దాడికి దిగిందని బహుళ ప్రచారం చేసాయి. ఎప్పటిలాగానే 'టెర్రరిజం' అనే భావనను అరబ్బులను 'రాక్షసులుగా' చిత్రించడానికి ఇజ్రాయిల్ వాడుకుంది. అయితే లెబనాన్‌పై ఇజ్రాయిల్ దాడికి అసలైన కారణం వేరే వుంది. దాన్ని ప్రపంచంలోని ప్రధాన ప్రసార సాధనాలేవి పరిగణలోనికి తీసుకోలేదు. సంక్లిష్టమైన ఆ కారణాన్ని వివరించడానికి యిక్కడ ప్రయత్నిస్తాను.

ముందుగా ఒక ప్రశ్న వేసుకుందాం? అరబ్బులే ఇజ్రాయిల్‌పై మొదట దండయాత్ర చేసి వుంటే పశ్చిమ దేశాలు యెలా స్పందిస్తాయో ఒక్కసారి ఊహిద్దాం? ఇజ్రాయిల్ దాడిని పాశ్చాత్య మీడియా స్వీయ రక్షణ చర్యగా సమర్థించింది. కాని లెబనాన్ ప్రతిఘటనను మాత్రం మతతత్వ టెర్రరిజంగా ప్రచారం చేసింది.

వక్రీకరింపబడిన ఈ వార్తల ప్రచారం సరిగ్గా ఇజ్రాయిల్‌లో జరుగుతున్న సార్వత్రిక ఎన్నికల సమయంలో జరిగింది. ప్రాశ్చాత్య ప్రసార సాధనాలు ఈ దాడిని మూడు కారణాలతో సమర్థించింది. 1) ఇజ్రాయిల్ సైనిక చర్య హిజబుల్లా దాడులకు ప్రతిగా జరిపిన స్వీయ రక్షణ చర్య 2) ఆ దాడి ఆచితూచి చేసిన చర్య 3) అసలు ఇజ్రాయిల్ సిరియా, ఇరాన్‌లపై కూడా దండెత్తవలసి ఉండింది. కాని అలా చేయక చాలా నిగ్రహం చూపించి.

యుద్ధం మొదలైన రెండవ రోజునే లండన్‌కు చెందిన 'టెలిగ్రాఫ్' పత్రిక "టెర్రరిస్టుల రాకెట్ దాడులకు ప్రతి చర్యగా, ఇజ్రాయిల్ బేరూట్‌కు వెలుపల గల హిజబుల్లా స్థావరాలపై దాడులు జరిపింది" అని ఇజ్రాయిల్‌ను సమర్థించింది.

ఆ దాడిపై రాసిన ఒక విశ్లేషణ వ్యాసపు శీర్షిక చూడండి, "హిజబుల్లాను అణచాలంటే, శక్తి మాత్రం చాలదు". బేరూట్ విలేఖరి ఇజ్రాయిల్ బాంబింగ్‌ను సమర్థిస్తూ "బలపడుతున్న హిజబుల్లా ఉద్యమాల పట్ల ఇజ్రాయిల్‌కు గల నిస్పృహ నిరాశలకు ఈ బాంబింగ్ నిదర్శనం" అని రాసాడు. ఏప్రిల్ 13న "లండన్ ఇకానమిస్ట్" ఇజ్రాయిల్ చర్యను కేవలం 'ప్రతిచర్య'గా పేర్కొనింది. లెబనాన్‌పై ఇజ్రాయిల్ దాడులు జరుపుతున్న సమయంలో టెలెఅవీవ్‌లో వున్న బ్రిటీష్ రక్షణ మంత్రి "ఇజ్రాయిల్ తీసుకొనే చర్యలు యెల్లప్పుడూ హడావిడి లేకుండా, యెంతో ఆలోచనతో అమలు చేసినవిగా వుంటాయి. అంతేగాక అవి తమపై జరిగిన దాడికి

తగిన స్థాయిలో మాత్రమే ఉంటాయి. హిజబుల్లాల వల్ల ఇజ్రాయిల్ చాలా పెద్ద టెర్రరిస్టు ప్రమాదాలను యెదుర్కొంటుంది. అందువల్ల (ఆ దేశపు) శాంతియుత కార్యక్రమాలకు భంగం వాటిల్లుతుందని" తన అభిప్రాయాన్ని వ్యక్తం చేసాడు. ప్రాశ్చాత్య విలేఖరులంతా బ్రిటీష్ రక్షణ మంత్రి అభిప్రాయాన్నే తమ అభిప్రాయంగా రాసారు.

కాని వాస్తవంలో, ఇజ్రాయిల్ ప్రతీకార దాడులు, హిజబుల్లా నుండి ఇజ్రాయిల్‌కు కలుగబోతుందని ఊహించే ప్రమాదంకన్నా, అత్యంత తీవ్రమైనవి షియా గెరిల్లా సైన్యపు సంఖ్య 500 కన్నా తక్కువే. దానికి వ్యతిరేకంగా పశ్చిమాసియాలోనే అతి శక్తివంతమైన సైన్యం సిద్ధం చేయబడింది. దానికి అత్యాధునిక ఎలక్ట్రానిక్ పరికరాలు అమర్చబడ్డ సూపర్‌సానిక్ జెట్ విమానాలు వున్నాయి. వాటికి తోడు అమెరికాలో తయారైన 'అపాఛె' యుద్ధ హెలికాప్టర్లూ వున్నాయి దాంతో ఇజ్రాయిల్ లెబనాన్‌లోని నిర్దిష్ట లక్ష్యాలపై గురి తప్పని దాడులు జరిపింది.

అయినా ఈ ఇజ్రాయిల్ దాడులను ప్రాశ్చాత్య మీడియం సమర్థించాలి కదా! ఇక ప్రాశ్చాత్య పత్రికలన్నీ మార్చి 4–ఏప్రిల్ 11 వరకు ఇజ్రాయిల్ జరిపిన దాడులను వివరిస్తూ, గత కొన్ని సంవత్సరాలుగా హింస యెలా అధికమైందో వివరించే గ్రాఫులను ప్రచురించాయి. హిజబుల్లా రాకెట్ దాడులు యెలా ఇజ్రాయిల్ సైనికులను హతమార్చాయో కూడా వివరంగా రాసాయి. అయితే వాస్తవంలో 1982 నుండి 14 సంవత్సరాల కాలంలో హిజబుల్లా రాకెట్ దాడులవల్ల చనిపోయిన ఇజ్రాయిల్ సైనికుల సంఖ్య కేవలం 14 కాగా, ఇజ్రాయిల్ యెదురు దాడులవల్ల వందల కొద్ది లెబనాన్ దేశస్థులు మరణించారు. ఈ విధంగా లక్షలమంది పాలస్తీనీయుల మానవ హక్కులు దారుణంగా అణచివేయబడుతున్నప్పటికీ, యెప్పుడూ ఇజ్రాయిల్‌నే బాధిత దేశంగా చూపించడం జరుగుతుంది.

ఇజ్రాయిల్ జరిపిన ఈ తాజా దురాక్రమణను సమర్థించడానికి చాలా వార్తా పత్రికలు, పాలస్తీన మిలిటెంట్ సంస్థ హమాస్‌తో, లెబనాన్ సంస్థ హిజబుల్లాను జత కలిపాయి. దాంతో, హిజబుల్లా దాడులను, గతంలో 1996లో డజన్ ఇజ్రాయిల్ దేశస్థులను చంపిన హమాస్ ఆత్మాహుతి దళాల దాడులకు కొనసాగింపుగా ప్రచారం చేసారు. అరబ్బులు టెర్రరిజంను ప్రోత్సహిస్తారని, ఇజ్రాయిల్ కేవలం స్వీయ

రక్షణార్థం ప్రతీకార దాడులను జరుపుతుందనే భావన సాధారణ ప్రజల్లో కల్గించడంలో ప్రాశ్చాత్య ప్రసార సాధనాలు విజయవంతమయ్యాయి.

అమెరికా పత్రికా రంగంకూడా ఇజ్రాయిల్ వాదననే ప్రచారం చేస్తూ వస్తూంది. 'న్యూస్ వీక్' పత్రిక ఏప్రిల్ 22న ఇజ్రాయిల్ దాడిపై ఒకే ఒక పేజి వార్త ప్రచురించింది. దానికి సీనియర్ ఇజ్రాయిల్ అధికారి యూరిలుబ్రాని (Uri Lubrani) చేసిన వాఖ్య "ఇది ఆరంభం మాత్రమే"ను శీర్షికగా పెట్టింది– ఆ తర్వాత హిజబుల్లాను దెబ్బతీయడానికి లెబనాన్ లోతట్టు ప్రాంతాలపై ఇజ్రాయిల్ దాడి జరిపింది" అనే ఉపశీర్షిక చోటు చేసుకుంది. ఇక ఇజ్రాయిల్ దాడులను సమర్థిస్తూ "నెలకు పైగా హిజబుల్లా దాడులు జరిగాయి. అమెరికా మధ్య వర్తిత్వంలో జరిగిన దౌత్య కార్యక్రమాలు సరిహద్దు ఉద్రిక్తతను తగ్గిస్తాయని, మధ్యలో ఆగిన శాంతి చర్చలు కొనసాగగలవనే ఆశ (ఇజ్రాయిల్) ప్రధానమంత్రి కుండింది. అందువల్ల నూ. మే 29న జరగబోయే ఎన్నికల దృష్ట్యా ప్రధానమంత్రి పెరేజ్ ఎదురు కాల్పులను ఆపాడు" అంటూ పెరేజ్‌ను పొగిడింది.

ఇజ్రాయిల్ దాడి మొదలైన 4 రోజుల తర్వాత "వాల్ స్ట్రీట్ జర్నల్" ఐరోపా ఎడిషన్ సంపాదకీయం "దెబ్బకు ఇజ్రాయిల్ ఎదురు దెబ్బ"లో "ఇజ్రాయిల్ అనుభవించిన కష్టాలను పరిగణలోనికి తీసుకుంటే, దాని ప్రతిస్పందన చాలా ఆచితూచి వేసిన చర్య మరియు న్యాయమైన చర్య"గా సమర్థించింది. ఇతర ప్రసార మాధ్యమాలవలె ఆ పత్రిక కూడా పై సంఘర్షణకు సిరియా దేశాన్ని నిందించింది. "మానవత్వానికి యే మాత్రం విలువనివ్వని ఉగ్రవాదులు, తమ ఆయుధగారాలను యుద్ధరీత్యా కీలక కేంద్రాలను సాధారణ పౌరుల మధ్యన నెల కొల్పాయి. ఆ కేంద్రాలు ఈ మధ్య కాలంలో జరిగిన అమానుషమైన దాడులకు కారణమయ్యాయి. అందువల్ల లెబనాన్‌లోనికి ఇజ్రాయిల్ ప్రస్తుత చొరబాటును న్యాయమైన ప్రతిస్పందనగా పేర్కొనవచ్చు." అంతేగాక ఇజ్రాయిల్ అంతర్జా తీయ 'చట్టాన్ని వుల్లంఘించలేదని నిరూపించేందుకు కేవలం అమెరికన్ మేధావు లనే వుటంకిస్తూ ఏప్రిల్ 16న ఒక వార్తను ప్రముఖంగా ప్రచురించింది.

బ్రిటన్‌లో అత్యంత ప్రాచుర్యం కలిగి, లక్షకుపైగా సర్క్యులేషన్‌గల "డెయిలీ టెలిగ్రాఫ్" తన సంపాదకీయంలో ఇజ్రాయిల్ "సంయమనాన్ని" గురించి ప్రచారం చేయడంలో మరొకడుగు ముందుకు వేసింది. "పరిస్థితులను బట్టి (తర్క

రీత్యా) చూస్తే ఇజ్రాయిల్ సిరియాపై దాడి చేయవలసి వుంది. కాని పాలస్తీనీయులతో శాంతి ఒప్పందానికి కారకుడైన పెరేజ్ అలాంటి చర్యకు యెందుకు దిగలేదో తెలుసుకొనడం సులభం" అంటూ ఇజ్రాయిల్ "సహనాన్ని" మెచ్చుకొంది. ఇజ్రాయిల్ 'సంయమాన్ని' తెల్పుతూ ఆ పత్రిక "ఇరాన్‌పై (ఇజ్రాయిల్) దాడి దౌత్యరీత్యా తక్కువ నష్టం కల్గిస్తుంది కాని అలా చేస్తే అసలైన డమాస్కస్ (సిరియా) పై దాడి చేయకుండా వదలి వేరేదారి పోయినట్లవుతుంది" అని వ్యాఖ్యానించింది. దాని దృష్టిలో సిరియాకు గుణపాఠం నేర్పడం ఇజ్రాయిల్ ప్రథమ కర్తవ్యం.

లెబనాన్‌పై ఇజ్రాయిల్ దాడులు చేస్తున్న సమయంలో ఇజ్రాయిల్ ప్రెస్ అధిపతి యూరీడ్రోమి (Uri Dromi)తో 'లండన్ టైమ్స్' పత్రిక ఇంటర్వ్యూ జరిపింది. దాని శీర్షిక, "ఇజ్రాయిల్ యిక ఇరాన్‌ను శిక్షించాలని చూస్తుంది." అందులో "ఇజ్రాయిల్ ప్రభుత్వ సీనియర్ ప్రతినిధి నిన్నటి దినం యిలా అన్నాడు. 1941లో కువైట్‌నుండి ఇరాక్ సేనలను తరిమి వేయడానికి పశ్చిమ దేశాలు ఒక సమాఖ్యగా ఏర్పడ్డాయి. అలాంటి సమాఖ్య యిపుడు ఇరాన్‌కు వ్యతిరేకంగా ఏర్పడి ఆ దేశం అణుశక్తిని సమకూర్చుకోకుండా చేయాల్సివుంది. ఆ ప్రణాళికలో భాగంగానే (ఇజ్రాయిల్) ముందు దాడిని నిర్వహించబోతుంది." అని రాసింది. దాంతో ఆగక 1981లో ఇరాక్‌లోని ఆస్రక్ (Osrak) అణుకేంద్రంపై ఇజ్రాయిల్ దాడి చేసి నాశనం చేయడం వల్ల, అరబ్ ప్రపంచం యెలా సురక్షితంగా వుందోకూడా ఆ పత్రిక సుదీర్ఘంగా వివరించింది. ఇంత రాసినా ఆ వ్యాసంలో ఇజ్రాయిల్ అణు ఆయుధ సంపత్తి గురించి ఒక మాటైనా లేదు.

ఇజ్రాయిల్ లెబనాన్‌పై చేసిన దాడులకు జరిగిన టెలివిజన్ ప్రచారం 1991లో అమెరికా ఇరాక్‌పై జరిపిన దాడులను గుర్తుకు తెచ్చాయి. తమ అమెరికన్ మిత్రులను అనుకరిస్తూ ఇజ్రాయిల్ తన సైన్యం లేజర్ ద్వారా నిర్దేశింపబడే ఆయుధాలను టెలివిజన్ ద్వారా చూపించింది. ఆ ఆయుధాలు గురి తప్పక ఖచ్చితంగా నిర్దేశింపబడిన లక్ష్యాలను యెలా చేరగలవో వివరించింది. గతంలో సాధారణ ఇరాకీ పౌరులను మట్టుపెడుతూ కూడా, అమెరికా యిలాంటి వీడియో ఫోటోలను చూపించి పత్రికా విలేఖరులను యెలా మోసగించిందో "ఆపరేషన్ డిసర్ట్" పై రాసిన పుస్తకాలలో వివరంగా తెలిపినా, ఇజ్రాయిల్ తిరిగి అదే పద్ధతిని అవలంబించడం ఆశ్చర్యం కల్గించింది.

అయినప్పటికీ ఇజ్రాయిల్ మోసపూరిత ప్రచారానికి, బి.బి.సితో సహా, ప్రధాన టి.వి. నెట్‌వర్క్‌లన్నీ విశేష ప్రాచుర్యాన్ని కల్గించాయి. అంతేగాక, విలేఖరులు అరబ్బుల పట్ల ద్వేషాన్ని రెచ్చగొట్టడానికి, ఇజ్రాయిల్‌పై తిరుగుబాటును కోరుతూ, రొమ్ములు బాదుకుంటూ ఆవేశంగా కేకలు వేసే మతోన్మాద ముస్లిముల దృశ్యాలను చూపారు. అంతేగాని తమ దేశాన్ని సమర్థిస్తూ తమ దృక్పథాన్ని (ఇజ్రాయిల్ వ్యతిరేక) వివరించగల సాధారణ లెబనాన్ పౌరున్ని మాత్రం పాశ్చాత్య టెలివిజన్లు చూపలేదు.

ఇజ్రాయిలీల హైటెక్ మిలిటరీ టెక్నాలజీ విఫలమై, క్వానాలోని ఐక్యరాజ్య సమితి స్థావరంలోని వందకుపైగా అమాయక కాందిశీకులు (డజన్లకొద్దీ స్త్రీలు, పిల్లలతో సహా) బాంబుల దాడిలో మరణించిన తరువాత, ప్రసార మాధ్యమాలు తమ వైఖరిని మార్చుకోక తప్పలేదు. లక్ష్యాన్ని (దగ్గరలోవున్న హిజబుల్లా స్థావరాలు) నిర్దేశించడంలో పొరపాటు జరిగిందనే ఇజ్రాయిల్ వాదనను స్వతంత్ర పరిశీలకులు ఖండించారు.

అయితే ఈ విషయాన్ని చాలా వార్తా పత్రికలు ప్రచురించిన తీరు, ఆ పత్రికల ఇజ్రాయిల్ పక్షపాత వైఖరికి అద్దం పడుతుంది. "లండన్ టైమ్స్" బ్రిటన్‌లో బహుళ ప్రాచుర్యం గల పత్రిక. బ్రిటన్ వ్యవస్థకు మూల స్థంభమైన ఆ పత్రిక (ఇపుడు ఆస్ట్రేలియా వాసి రూపర్ట్ మర్డోక్ అధీనంలో వుంది) పై హత్యలకు సంబంధించిన వార్తకు శీర్షిక యిలా వుంచింది. "97 మంది మరణం తర్వాత క్లింటన్ శాంతి చర్యలకు పిలుపు నిచ్చాడు" పై శీర్షికకు పైనగల వాక్యం యిలా వుంది. "హిజబుల్లా కాల్పులు విరమించేంతవరకు లెబనాన్‌పై దాడి కొనసాగుతూంది".

అమెరికా ప్రసార సాధనాలు వార్తలను ప్రచురించిన తీరు, ఇజ్రాయిల్ చర్యను మరింత సమర్థించేదిగా వుంది. "వాల్‌స్ట్రీట్ జర్నల్"లోని శీర్షిక క్వానా హత్యకాండను సౌమ్యమైనదిగా చిత్రించింది. "ఇజ్రాయిల్ ఐక్యరాజ్యసమితి స్థావరాలపై జరిపిన దాడివల్ల డజన్లకొద్దీ మరణించారు" అని రాసింది. ఏప్రిల్ 29న న్యూస్‌వీక్ కవర్‌స్టోరి ఈ హత్యలను ఎదురు కాల్పులుగా చెబుతూ, పొరపాటు వల్ల వందమంది లెబనాన్ పౌరులు మరణించారని తెల్పింది. దాని ప్రత్యర్థి అయిన "టైమ్స్" పత్రిక, ఏప్రిల్ 29 నాటి సంచికపు పతాక వ్యాసం శీర్షిక యిలా వుంది

"కోపము-రక్తము-ఘోరమైన పొరపాటు దరిమిలా ఇజ్రాయిల్ కఠిన వైఖరి ప్రదర్శన"- ఇదంతా ఇజ్రాయిల్ టెర్రరిజం ఎడల ఆ పత్రికలు చూపిన సమర్థన తప్ప మరేమికాదు.

"డెయిలీ టెలిగ్రాఫ్" పై దారుణ మారణ కాండను "ఇజ్రాయిల్ బాంబులు 94 మంది కాందిశీకులను చంపాయి" అనే శీర్షిక పెడుతూ, ఆ పక్కనే "మా ప్రజలను కాపాడుకోవడానికి మాకు వేరే మార్గం లేదు" అనే ఇజ్రాయిల్ ప్రధాన మంత్రి పెరేజ్ సమర్థనను ప్రచురించింది. అంతేగాకుండా, ఇజ్రాయిల్ ఉగ్ర వాద చర్యలనుండి పాఠకుల దృష్టిని మరల్చడానికి, హిజబుల్లా చర్యలకు సిరియా వైస్ ప్రసిడెంట్ హఫీజ్ అల్ అసాద్‌ను కారకునిగా పేర్కొనింది.

ఏప్రిల్ 19 నాటి మారణకాండ గురించిన సంపాదకీయంలో యిలా వుంది. "ఇజ్రాయిలీలు. హఫీజ్ (సిరియా వైస్ ప్రసిడెంట్)ను హిజబుల్లాకు వ్యతిరేకంగా రెచ్చగొట్టాలంటే (తన నీచమైన చర్యలకు ప్రతిఫలం చెల్లించేలా చేయాలంటే), ఇజ్రాయిల్, సిరియా మరియు దాని మిత్రదేశాలపై తన దృష్టిని సారించాలి. అవసర మైతే సిరియానే లక్ష్యంగా చేయాలి. అలాంటి చర్య రక్షణ వ్యూహరీత్యా అవసర మైనదేగాక, ఒక మహాదుర్మార్గుడైన గోలియత్‌లాంటి 'రాక్షసుణ్ని' చంపి, తూర్పు, మధ్యధరా సముద్ర ప్రాంత దేశాలను సంరక్షించిన దేవిడ్ (దేవదూత)గా ఇజ్రా యిల్ తన గొప్పతనాన్ని తిరిగి నెలకొల్పడానికి తోడ్పడుతుంది." అని ఉచిత సలహా యిచ్చింది. "టెలిగ్రాఫ్" పత్రికాధిపతి కాన్రాడ్ బ్లాక్ "జెరుసెలమ్ పోస్ట్" అనే పత్రికకు అధిపతి కావడమే ఈ ఇజ్రాయిల్ అనుకూల వైఖరికి కారణంగా చెప్పవచ్చు.

బ్రిటన్‌లో అత్యధిక సంఖ్యాకులు చదువుతున్న వారపత్రిక "సండే టైమ్స్" కూడా ఇజ్రాయిల్ చర్యను సమర్థించడానికి ప్రయత్నించింది. "విస్తరించిన భయం" అనే శీర్షిక కింద హిజబుల్లా పోషకులు మరియు లెబనాన్‌లోని అధికార దళారులు (power brokers) (పై హత్యాకాండకు) మరింత యెక్కువ బాధ్యత వహించ వలసి వుంది. ఇరాన్ దేశపు అయతుల్లా ఖుమేని హిజబుల్లా దాడులకు ప్రోత్సాహ మిస్తున్నంత కాలం, ఆ దేశంపై టెర్రరిస్టు దేశమనే ముద్ర వుంటుంది. ఇస్లాం మతశక్తులు రాజ్యమేలుతున్న ఇరాన్, ఇరాక్ మరే యితర దేశమైనా అణ్వాయుధా లను సంపాదించుకుంటే, ప్రపంచం కొత్త ఉగ్రవాద దశలోనికి అడుగిడుతుంది అని

వ్యాఖ్యానించింది. పై సంపాదకీయంలో రెండు పూర్తిగా విరుద్ధ రాజకీయ భావాలు కలిగి, బద్ధ శత్రువులుగా వున్న ఇరాన్, ఇరాక్‌లను మతతత్త్వ రాజ్యాలుగా జమ కట్టడం చూస్తే, ప్రచారం కోసం వాస్తవాలను యెలా వక్రీకరిస్తారో తెలుస్తుంది. (ఇరాక్ సెక్యులర్ రాజ్యాలలో ముఖ్యమైనదనే విషయం గుర్తుంచుకోవాలి.)

**చాలావరకు పట్టించుకోని విషయం :**

అయినా ఎప్పటిలాగానే ఈ అబద్ధాలు మీడియా ద్వారానే బట్టబయలు చేయబడ్డాయి. ఐక్యరాజ్యసమితి స్థావరంపై ఇజ్రాయిల్ బాంబింగ్ తెలిసి చేసిందా లేక పొరపాటు వల్ల జరిగిందా అనే విషయానికే యెక్కువ ప్రాధాన్యత యిచ్చారు. కాని ప్రధాన విషయమైన - పశ్చిమ ఆసియాలో భద్రత విషయంలో వచ్చిన మార్పు గురించి మాత్రం చర్చ జరగలేదు. లెబనాన్‌పై దాడి జరపడానికి కొద్ది రోజులముందే ఇజ్రాయిల్ టర్కీతో ఒప్పందం కుదుర్చుకుంది. ఈ విషయం ఏ ప్రాశ్చాత్య మీడియా పేర్కొనలేదు. అరబ్ దేశాల సమాఖ్యచే "దౌర్జన్యకర చర్య" (act or aggression) గా పిలువబడ్డ టర్కీ—ఇజ్రాయిల్ ఒప్పందంవల్ల ఇజ్రాయిల్‌కు టర్కీ విమాన స్థావరాలను వినియోగించుకొనే అవకాశం కల్గింది. ఈ ఒప్పందం, టర్కీ కూడా బలపరిచిన ఇస్లామిక్ దేశాల సమాఖ్య తీర్మానాన్ని ఉల్లంఘిస్తుంది కూడా. అరబ్ భూభాగాన్ని ఇజ్రాయిల్ ఆక్రమించినంత కాలం ఆ దేశంతో అరబ్ సమాఖ్య లోని యే దేశమూ యే రకమైన మిలటరీ ఒప్పందం కుదుర్చుకోకూడదని ఆ తీర్మానం చెబుతూంది. ఈ ఒప్పందం వల్ల ఇజ్రాయిల్‌కు మధ్యధరా సముద్రం నుండి, ఎర్ర సముద్రం వరకు ఆధిపత్యం లభిస్తుంది. అంతేగాక ఇజ్రాయిల్ తన సైనిక చర్య జరిపే పరిధి విస్తరించింది. అది ఇప్పుడు తన అత్యంత బలమైన శత్రువు, సిరియాను రెండువైపుల నుండి యెదుర్కొనే అవకాశం లభించింది. అంతేగాక ఇరాన్‌కు అతి దగ్గరిలో తన సైన్యాన్ని మోహరించే అవకాశమూ వుంది. ఇప్పుడు, భవిష్యత్‌లో జరిగే దాడులను యెదుర్కొనడానికి అమెరికా-ఇజ్రాయిల్‌ల మధ్య "రక్షణ ఒప్పందం" గురించి మాటలు వినవస్తున్నాయి. బిల్‌క్లింటన్ "అమెరికా ఇజ్రాయిల్‌ల మధ్య యుద్ధతంత్ర సంబంధమైన సహకారం అభివృద్ధి కాగలదు" అని అన్నాడు కూడా.

కాని చాలామంది ప్రాశ్చాత్య జర్నలిస్టులకు పై విషయాలన్నీ ముఖ్యమైన వార్తలు కావు. వాస్తవానికి "టైమ్స్", "న్యూస్‌వీక్", "ఎకానమిస్ట్"లు ఈ భద్రతా ఒప్పందం గురించి ఒక వాక్యమైన రాయలేదు.

ఈ ఒప్పందం వల్ల ధైర్యం పుంజుకున్న ఇజ్రాయిల్ ప్రభుత్వం, తాను లెబనాన్‌పై దాడిచేస్తే, ఆ దేశపు అధ్యక్షుడు సిరియాపై ఒత్తిడి తెస్తాడని, అప్పుడు సిరియా 'హిజబుల్లా'ను అణచివేస్తుందని అంచనా వేసింది. అదే సమయంలో అమెరికా అధ్యక్షుడు క్లింటన్ హాజరయిన, ఈజిప్టు అధ్యక్షుడు ముబారక్ ఏర్పాటు చేసిన 29 అరబ్బు దేశాల టెర్రరిజం వ్యతిరేక సమావేశంలో ఇరాన్, సిరియాలు ఒంటరి చేయబడ్డాయి. మొట్టమొదటిసారిగా మొరాకో నుండి గల్ఫ్‌వరకు అరబ్ నాయకులంతా ఇజ్రాయిల్‌తో సంఘీభావం ప్రకటించారు. జోర్డాన్ రాజు హుస్సేన్, ఇరాక్ అధ్యక్షుడు సద్దాం హుస్సేన్‌తో సంబంధాలు తెగతెంపులు చేసుకొని 1994 లో ఇజ్రాయిల్‌తో ఒప్పందం కుదుర్చుకున్నాడు. ఈ సంఘటనల తర్వాత, లెబనాన్‌లో ఆ దేశపు సహాయార్థం 30,000 మంది సైనికులను పంపిన సిరియా అధ్యక్షుడు అసాద్‌కు గుణపాఠం నేర్పడానికి ఇజ్రాయిల్‌కు అత్యుత్తమ అవకాశం దొరికింది. అంతేగాక, తాను సమర్థుడైన నాయకుడని ఇజ్రాయిల్ దేశస్థులకు తెలిపి ఎన్నికల్లో గెలుపొందడానికి తన లెబనాన్‌పై దాడికి బాగా ఉపయోగపడుతుందని పెరేజ్ భావించాడు. అదే సమయంలో లండన్, పారిస్, న్యూయార్క్‌లలోని ఇజ్రాయిల్ మద్దతుదారులైన బలమైన లాబీలు ఇజ్రాయిల్‌ను సమర్థిస్తాయనే నమ్మకం ఎటూ ఉండనే ఉంది. అమెరికా రాజధానిలో అన్నిటికన్నా బలమైన లాబీ అమెరికన్-ఇజ్రాయిల్ పబ్లిక్ విషయాల కమిటీ అనేది అందరికీ తెలిసిన విషయమే. అమెరికా చరిత్రలోనే యూదులను ఎక్కువగా సమర్థించే అధ్యక్షుడు క్లింటన్ ఉండనే ఉన్నాడు. ఇతడు మార్చి 5న జరిగిన 'హమాస్' ఆత్మాహుతి దళపు బాంబింగ్‌ను తీవ్రంగా నిరసించాడు కూడా. ఆ బాంబింగ్ "అమాయకులైన ప్రజలను (పిల్లలతో సహా) చంపిన, ప్రమాదభరితమైన మత దురభిమాన చర్యనేగాక, మధ్య ఆసియాలో మెరుగు అవుతున్న శాంతి ప్రయత్నాలను నాశనం చేసినటువంటిది'' అని క్లింటన్ తీవ్రంగా విమర్శించాడు. అయితే యిందుకు పూర్తిగా విరుద్ధంగా, ఇజ్రాయిల్ లెబనాన్‌పై దాడి చేసి స్త్రీలను, పిల్లలను చంపినపుడు మాత్రం ఇజ్రాయిల్ దాడిని యే మాత్రం విమర్శించక, అన్ని పార్టీలను కాల్పుల విరమణ చేయమని కోరాడు అదే మహాశయుడు క్లింటన్.

జియోనిస్టులు (యూదులను బలపరిచేవారు) అరబ్‌లను విలన్‌లుగా చిత్రీకరించడంతో, అమెరికాలో ఇజ్రాయిల్ పట్ల అన్ని రాజకీయ పార్టీలు యేమాత్రం

తేడా లేకుండా విధేయత ప్రకటించాయి. రిపబ్లిక్ పార్టీ తరపున పోటీ చేసిన, బాబ్‌డోల్, అధికార పార్టీ అభిప్రాయాన్నే అనుకరించాడు. "ఇదంతా హిజబుల్లా రెచ్చగొట్టడంవల్ల జరిగిందేనని మీరంతా గుర్తుంచుకోవాలని" ప్రజలకు హితవు చెప్పాడు. పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ డోల్, "ఇజ్రాయిల్‌కు మార్గాంతరం (లెబనాన్‌పై దాడి చేయడం తప్ప) కనిపించలేదు'' అని ఇజ్రాయిల్ చర్యను సమర్థించాడు.

ఇక సహజంగానే ఐక్యరాజ్యసమితి భద్రతామండలి ఇజ్రాయిల్ చర్యను ఖండించకుండా చేయడానికి అమెరికా తన శాయశక్తుల ప్రయత్నించింది. లెబనాన్ లోని సామాన్య ప్రజలపై ఇజ్రాయిల్ దాడిని ఖండిస్తూ, విమాన దాడులను ఆపా లంటూ ఐక్యరాజ్య సమితి మానవ హక్కుల సంఘం చేసిన తీర్మానాన్ని అమెరికా మాత్రమే వీటో చేసింది. గత దశాబ్దం పైగా, ఐక్యరాజ్య సమితి తీర్మానాలను, అంతర్జాతీయ న్యాయ నిబంధనలను ఇజ్రాయిల్ క్రమం తప్పకుండా ఉల్లంఘిస్తున్న ప్పటికీ ఇజ్రాయిల్ ప్రమాదకర దేశంగా కాని, ఉగ్రవాద దేశంగా గాని గుర్తించ బడలేదు. అయితే అమెరికా ఆ ముద్రలను తనకు శత్రువులనుకున్న దేశాలపై యే చిన్న కారణం చూపైనా రుద్దుతూంది. జూలై 1993 లో ఒక వైపు శాంతి చర్చలు (వాషింగ్‌టన్‌లో) జరుగుతుండగా, మరోవైపు "ఆపరేషన్ అకౌంట్ బిలిటీ" మూలాన వేలాది లెబనాన్ పౌరులు కాందిశీకులయ్యారు.

ఆనాడుకూడా, 1996 నాటిలాగా ఇజ్రాయిల్‌ను కవ్వించినందుకు, హిజ బుల్లాను అమెరికా నిందించింది. ఇరుపక్షాలను నిగ్రహం పాటించమని కోరింది. ఇప్పటిలాగానే, ఆనాడు ఇజ్రాయిల్ ప్రయోజనాల కనుగుణంగా సంఘటనలు చిత్రీక రించబడ్డాయి. ఇజ్రాయిల్ అభిప్రాయాల్నే ప్రాశ్చాత్య పత్రికలు, టెలివిజన్ ఏక పక్షంగా ప్రచారం చేసాయి. అరబ్‌ల అభిప్రాయాలకు లభించిన ప్రాముఖ్యత తక్కువ.

"వాళ్ళను (లెబనాన్ ప్రజలను) చాలా సమర్థవంతంగా చంపా"మని ఇజ్రాయిల్ లెబనాన్‌పై జరిపిన దాడి తర్వాత ఇజ్రాయిల్ పత్రిక "హరెట్జ్" (Ha'aretz) లో ఒక వ్యాఖ్యాత రాసాడు. అంతటితో ఆగక "వైట్‌హౌస్" (అమెరికా), సెనేట్, "న్యూయార్క్ టైమ్స్" మా చేతిలో వుండగా, యితరుల ప్రాణాలకన్నా మా ప్రాణాలు మిన్న అని గట్టిగా నమ్ముతున్నాము'' అని అమెరికా మద్దతుపై ధీమా ప్రకటించాడు.

ఇస్లాంను రాక్షసిగా చిత్రించడం (DEMONISING ISLAM)

ఇజ్రాయిల్ చాలా తెలివిగా, ఇస్లాంను ప్రాశ్చాత్య దేశాలకు ముప్పుగా చూపుతున్నది. ఆ ప్రయత్నాలకు ప్రాశ్చాత్య ప్రసార సాధనాలు బాగా తోడ్పడు తున్నాయి. అవి ముస్లింలనందరినీ మతతత్త్వ వాదులుగనే చిత్రీకరిస్తూ వున్నాయి. ఈ విధంగా ఒక బిలియన్ ప్రజలు విశ్వసించే ఒక మతాన్ని చెడుగా చిత్రీకరించే వెనుక రాజకీయ దురుద్దేశ్యం వుంది. ఇజ్రాయిల్‌ను మతరహిత, ప్రజాస్వామ్య దేశంగా ప్రచారం చేస్తూ, దానికి శత్రువుగా మిలిటెంట్ ఇస్లాంను ఒకదానిని తయారు చేయడం జరుగుతుంది. అదే సమయంలో పశ్చిమ దేశాల్లో, ఈ గొప్పమతం నాగరికతకు చేసిన సేవల గురించి సరైన అవగాహన లేకపోవడంతో, ప్రసార సాధనాల తప్పుడు ప్రచారాన్నే ఆ ప్రజలు విశ్వసించే పరిస్థితి యేర్పడింది. అమెరికా ప్రజలలో, ఇస్లాం మతాతీత, ఉదారవాద, నాగరిక శక్తులకు శత్రువు అనే బలమైన, స్థిరమైన అభిప్రాయం నాటుకపోయింది 168 మందిని బలిగొన్న, ఓక్ల హోమా బాంబింగ్ సమయంలో ముస్లిం పట్ల అమెరికన్ ప్రజలకు గల ఈ దురవగాహన ప్రస్ఫుటమైంది. ఏ ఆధారం లేకుండానే, ఈ టెర్రరిస్టు చర్యను అమెరికన్ ప్రసార సాధనాలు ఇస్లామిక్ సంస్థలకు ఆపాదించాయి. కాని చివరకు ఆ ఘాతుకానికి కారణం అమెరికాలోని ఒక అతివాద దక్షిణపక్ష (Far right) వర్గమని తేలింది. హాలీవుడ్ చిత్రాలు కూడా ముస్లింలను ఛాందసవాదులుగా చిత్రీక రిస్తున్నాయి. ఈ మధ్య బహుళ ప్రజాదరణ పొందిన "ట్రూలైస్" (True Lies) అనే చిత్రంలో ఆర్నాల్డ్ షెవార్జినగర్ అనే నాయకుడు, 80 మంది అరబ్ టెర్రరిస్టులను చంపినట్టు చిత్రీకరించారు. ప్రపంచ వ్యాప్తంగా సామ్రాజ్యవాద సంస్కృతికి కేంద్రమైన హాలీవుడ్ నుండి యిటీవల వెలువడిన "ఎగ్జిక్యూటివ్ డిసెషన్'' (Executive Decision) ముస్లింల భావాలను కించపరిచేదిగా ఉంది. అందులో, చెచెన్యా ముస్లిం తిరుగుబాటుదారులు అమాయకులైన ప్రాశ్చాత్యులను చంపి, వాషింగ్టన్ పైన కూల్చే వుద్దేశ్యంతో ఒక విమానాన్ని దారి మళ్ళించి నట్టు చిత్రీకరించారు.

ప్రసార సాధనాల ప్రచారం వల్ల ప్రాశ్చాత్య దేశాల్లో ముస్లింలు ప్రతి చిన్న విషయానికి కయ్యానికి కాలుదువ్వే మతతత్త్వ వాదులుగా ప్రజలలో చలామణి చేయబడుతున్నారు. బ్రిటన్‌లో నివసించే ఒక లక్ష ముస్లిం జనాభాలో, ఒక చిన్న

గుంపు సాల్మన్ రష్డీ నవల "సటానిక్ వర్సెస్''ను లాంఛనంగా తగలబెట్టడాన్ని "ముస్లింలు మత దురభిమానులు" అని స్థిరపడిపోయిన ఒక భావాన్ని మరింత దృఢపరచడానికి ప్రసార సాధనాలన్నీ ప్రయత్నించాయి. ఫ్రాన్స్‌లో ముస్లింలు సాంప్రదాయ దుస్తులు ధరించే హక్కుకై పోరాడుతున్నారు. జర్మనీ, బాల్కన్ దేశాలలో టర్కిష్ ప్రజల పట్ల దురభిప్రాయం మెండుగా ఉంది. చెచెన్యా సంఘర్షణ జరుగుతున్నపుడు రష్యన్ ముస్లింలను మాదక ద్రవ్యాలు అమ్మే దొంగలుగా ప్రచారం జరుగుతుంది.

కాని, వాస్తవంలో ముస్లింలు, ఈ మధ్యకాలంలో బోస్నియా, చెచెన్యా, ఇరాక్ మరియు సోమాలియాలలో ఘోరమైన దాడులకు గురైన బాధితులే. అయినప్పటికీ వారిపైనే నింద మోపబడుతుంది. ఇజ్రాయిల్ లెబనాన్‌పై చేసిన దాడి ఒక రోజు ముందే (ఏప్రిల్ 10 న) "వాల్ స్ట్రీట్ జర్నల్" యూరప్ ఎడిషన్ తన సంపాదకీయ పేజీలో ఒక విశ్లేషణాత్మక వ్యాసం ప్రచురించింది. అందులో, "దౌర్జన్య స్వభావం గల దేశాలు ఇజ్రాయిలును మించి మరేమో కావాలని కోరుతున్నాయి" అని రాసారు "భౌగోళిక–రాజకీయ కోణంలో చూస్తే అరబ్–ఇజ్రాయిల్ తగాదా–ఇరుగు పొరుగు దేశాల మధ్య తగాదా. ఇది ఇరాన్, సిరియా, ఇరాక్ మరియు యితర దౌర్జన్యకర (rogne) దేశాలు కలిసి చేస్తున్న భౌగోళిక–రాజకీయ యుద్ధంలో అతి కీలకమైన పాత్ర వహిస్తున్నది. ఆ దేశాలు మధ్య ఆసియాలో పాశ్చాత్య దేశాల ప్రయోజనాలను దెబ్బతీయాలనీ, అక్కడి చమురు నిక్షేపాలపై, చమురు సరఫరా చేసే మార్గాలపై తమ పట్టును సాధించి, తద్వారా క్రైస్తవ మతాన్ని అవలంబించే పాశ్చాత్య దేశాలను మట్టుపెట్టాలని చూస్తున్నాయి'' అని కూడా తన అభిప్రాయాన్ని ఆ వ్యాసం వెలిబుచ్చింది.

ప్రచ్ఛన్న యుద్ధం తర్వాత యిలాంటి వాదన సర్వ సాధారణమయింది. పాశ్చాత్య దేశాల నాగరికతకు, ఇస్లాం ఛాందసవాదం ఒక కొత్త ప్రమాదంగా చూపుతున్నారు. (గతంలో కమ్యూనిజాన్ని చూపేవారు) క్రైస్తవ, యూదు, హిందూ ఛాందసవాదం గురించి ప్రపంచ వార్తలలో యిలాంటి దుష్ప్రచారం యెప్పుడూ లేదు.

ఇస్లాంపై యిలాంటి విష ప్రచారానికి ఒక ముఖ్యమైన కారణం, ప్రపంచ వ్యాప్తంగా లభించే పెట్రోలియం ఉత్పత్తులలో 3/4 వంతు ఇస్లాం దేశాలలో లభించ

డమే. పెట్రోలియం పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన పాశ్చాత్య దేశాలకు చాలా అవసరం. ఇస్లాంను చెడుగా చిత్రీకరించడం వల్ల పాశ్చాత్య దేశాల భౌగోళిక రాజకీయ అవసరాలు (ఆయుధాలు అమ్మడం–చమురుకొనడం) నెరవేరుతాయి. అరబ్ దేశాలు, అమెరికా ఆయుధాలకు మంచి మార్కెట్ కావడం కాకతాళీయం కాదు.

పాశ్చాత్య దేశాల స్నేహితులను మంచివారిగా, శత్రువులను దుర్మార్గులుగా ప్రచారం చేయబడుతున్నాయి. ఇరాక్, ఇరాన్, ఆఫ్ఘనిస్తాన్‌లాంటి దేశాలకు సంబంధించిన వార్తలను ప్రసారం చేసినపుడు పైతేడా స్పష్టంగా కనబడుతుంది. పాశ్చాత్య దేశాలు టెలికమ్యూనికేషన్ రంగంలో ఆధిపత్య స్థానంలో వుండటంతో, వారి ప్రచార దృక్పథం ప్రపంచ దృక్పథాన్నే ప్రభావితం చేస్తూంది. ఇరాన్ గురించి పాశ్చాత్య ప్రసార సాధనాలలో వచ్చే ప్రతి వార్తలోనూ ముల్లాల పరిపాలనలో 'జరుగుతున్న' అఘాయిత్యాల గురించి వివరించడం తప్పనిసరిగా వుంటుంది.

1979 నాటి ఇస్లాం దేశాల తిరుగుబాటుకు ముందు ఇరాన్ అమెరికాకు, ఇతర పాశ్చాత్య దేశాలకు మంచి మిత్రదేశం. షా పరిపాలనను గొప్పగా స్తుతించారు కూడా. నేడు కూడా అమెరికాలో ఆనాటి ఇరాన్ రాజా షా రాజకీయ స్థిరత్వం లేని ప్రాంతంలో సుస్థిరత తెచ్చినవాడుగా గుర్తించబడుతున్నాడు. ఏ రకంగా పరిశీలించినా లంచగొండి, నిరంకుశుడు అయిన షాను మంచివాడుగా చూపేందుకు బి బి.సి పలువిధాల ప్రయత్నించింది. కారణం ఆనాడు షా ప్రభుత్వం అమెరికాకు తొత్తుగా ప్రవర్తించడమే.

కాని ఇస్లాం ప్రభుత్వ ఆధ్వర్యంలోని నేటి ఇరాన్ అమెరికాకు తొత్తుగా వ్యవహరించడం లేదు. అందువల్ల దానిపై విపరీతమైన దుష్ప్రచారం జరుగుతోంది. యే పాశ్చాత్య ప్రసార సాధనాలలో కూడా ఇరాన్‌కు అనుకూలంగా ఒక్క వార్త కూడా రావడం అసంభవం. 1994 సం॥రపు ఐక్యరాజ్యసమితి మానవ అభివృద్ధి రిపోర్టు ప్రకారం, గత 10 సంవత్సరాలలో ఇరాన్ , మానవ అభివృద్ధిలో గణనీయమైన ప్రగతిని సాధించిన 10 దేశాల్లో ఒకటిగా చెప్పబడింది. అయితే పాశ్చాత్య ప్రసార సాధనాలు ఈ విషయం తెలుపనందున చాలామందికి ఆ విషయం తెలియనే తెలియదు. అమెరికా ఆంక్షలు విధించినా, అమెరికా ప్రోత్సాహంతో

ఇరాక్-ఇరాన్‌తో 8 సం॥రాల యుద్ధం జరిపినా కూడా ఇరాన్ పై విజయాన్ని సాధించింది. (అయితే పాశ్చాత్య మీడియాకు యిది ప్రధానమైన వార్త కాదు).

పై వాస్తవాలకు బదులుగా పాశ్చాత్య మీడియా ద్వారా మనకు కన్పించే ఇరాన్ కయ్యానికి కాలుదువ్వే అయతుల్లా ఖుమేని రాజ్యమేలుతున్న దేశం. దీని కుదాహరణగా ఇరాన్ అణ్వాయుధాలను - ఇస్లాం బాంబును సమకూర్చుకుంటున్నదనే వార్తలను అను నిత్యం ఊదరగొడుతుంది మీడియా - కాని, వియన్నాలోని అంతర్జాతీయ అణుశక్తి సంస్థ "ఇరాన్ అణు కార్యక్రమం శాంతియుతమైనదని" పేర్కొన్న విషయం మనకెవ్వరికీ తెలియదు. కారణం అంతర్జాతీయ ప్రసార సాధనాలు ఆ వాస్తవాల్ని బయటపెట్టవు. ఇజ్రాయిల్ వద్ద యిప్పటికీ అణుకిపణు లున్నాయనే విషయం మాత్రం అమెరికన్ 'నిపుణులను' యే మాత్రం కలవర పెట్టదు. కాని, ఇరాన్ యింకా బాంబు తయారు చేయవలసి వుంది అని అంగీక రిస్తూనే, ఆ దేశం ప్రపంచ శాంతికి భంగకరం అని ప్రచారం చేస్తాను.

ఇజ్రాయిల్ లెబనాన్‌పై దాడి చేసిన కొద్ది రోజులలోనే అమెరికా స్టేట్ డిపార్ట్ మెంట్ టెర్రరిజంను ప్రోత్సహించే దేశాల జాబితాను ప్రచురించింది. అందులో, ఇరాన్, సిరియా, ఇరాక్, లిబియా, క్యూబా, ఉత్తర కొరియా, సూడాన్ దేశాల పేర్లున్నాయి. వీటిలో కమ్యూనిస్టు దేశాలయిన క్యూబా, ఉత్తర కొరియా మినహా మిగిలిన 5 దేశాలు ఇస్లామిక్ దేశాలు. చాలా ప్రసార సాధనాలు, స్టేట్ డిపార్ట్ మెంట్ రిపోర్టును యే మాత్రం విమర్శించకుండా, ఇరాన్‌ను ప్రపంచ వ్యాప్తంగా టెర్రరిజంను ప్రోత్సహించే దేశంగా పేర్కొన్నాయి. తమ అవాస్తవికమైన ఆరో పణలను సమర్థించుకొనడానికి ఇరాన్ ఉత్తర ఆమెరికా నుండి మధ్య ఆసియా వరకు గల ఉగ్రవాద సంస్థలకు సహాయం అందిస్తున్నదనే నిరాధారమైన ఆరోపణ లను ప్రచారం చేస్తున్నాయి. ఇప్పుడు క్లింటన్ మరొక ముందడుగువేసి, తన యూరోపియన్ మిత్రులకూ కోపం తెప్పించే విధంగా నాన్-అమెరికన్ కంపెనీలు కూడా ఇరాన్‌తో వాణిజ్య సంబంధాలు పెట్టుకోగూడదనే ఆంక్షలు విధించాడు.

ఇరాన్‌తో పాటు ఇరాక్ కూడా అమెరికా హిట్‌లిస్ట్‌లో ప్రధానమైంది. పశ్చిమ దేశాలు, అమెరికా, ఇరాన్‌లోని ఇస్లామిక్ తిరుగుబాటును అణచివేసేందుకు, ఇరాక్‌ను ఒక పరికరంగా వినియోగించుకున్నాయి. ఇరాక్‌కు విపరీతంగా ఆయుధాలు సరఫరా చేసి గల్ఫ్ యుద్ధాన్ని ప్రోత్సహించాయి. తత్ఫలితంగా లక్షమందికి పైగా

ఇరాన్, ఇరాక్ ప్రజలు మరణించారు. కాని, ఆ తర్వాత ఇరాక్ నియంత సద్దాం హుస్సేన్ అమెరికన్ ఆజ్ఞలను పాటించక పోవడంతో మీడియా వ్యతిరేక ప్రచారం మొదలయింది. పెంటగన్ ప్రజా సంబంధాల శాఖలుగా, అమెరికా ప్రసార సాధనాలన్నీ పనిచేసాయి. ఆ విధంగా తమ దుష్ప్రచారంతో అవి రెండవ గల్ఫ్ యుద్ధానికి (1991) కారణాలయ్యాయి. (ఇదే, ప్రపంచంలో జరిగిన మొదటి మీడియా యుద్ధము). అయితే యుద్ధానికి గల అసలైన కారణాలు యెక్కడా చర్చించబడ లేదు అసలైన కారణాలేమంటే, ప్రచ్ఛన్న యుద్ధం తర్వాత ప్రపంచంలో అమెరికా "అజండా", తమ సేనలను శాశ్వతంగా గల్ఫ్‌లో నిలిపి, చమురు బావులను తన అదుపులో వుంచుకొనడమనే అమెరికా ఆధిపత్య ధోరణే.

అమెరికా యొక్క ప్రయోజనాల దృష్ట్యా వివిధ దేశాలను యెలా చిత్రీకరిస్తామో తెల్పడానికి ఆఫ్ఘనిస్తాన్ మరొక మంచి ఉదాహరణ. ప్రచ్ఛన్న యుద్ధం చివరి రోజులలో, మిలిటెంట్ ఇస్లాంవాదులయిన ముజాహిద్‌నులు నాస్తికులయిన కమ్యూనిస్టులతో యుద్ధం చేస్తున్నపుడు హీరోలుగా చిత్రీకరించబడ్డారు. ఆ ముజాహిదిన్‌లే నేడు అమెరికా ఆజ్ఞలను పాటించనందున, ఇస్లాం మత దురభిమానులుగా చిత్రీకరింపబడుతున్నారు. సోవియట్ సేనలు ఆఫ్ఘనిస్తాన్‌లో వున్నంత కాలం ప్రపంచంలోని మీడియాలన్నీ, ఇస్లామాబాద్ నుండి, పాశ్చాత్య దౌత్య వర్గాలను వుటంకిస్తూ తమ దుష్ప్రచారాన్ని సాగించాయి. అమెరికన్ రహస్య ఏజంట్ల (సి.ఐ.ఏ) నుండి నిధులు పొందుతూ, మాదక ద్రవ్యాలను అమ్మే కిరాయి హంతకులులాంటి ముజాహిదీన్ "స్వతంత్ర యోధులు"లను గొప్ప హీరోలుగా చిత్రిస్తూ కథనాలు వెలువడ్డాయి. రష్యన్లు ఆఫ్ఘనిస్తాన్‌ను వదలడంతో, యిక ఆ దురదృష్టకరమైన దేశం గురించిన వార్తలు తగ్గాయి. మీడియా ధోరణి మారింది. ఆఫ్ఘనిస్తాన్‌తో యుద్ధం చేసే మతతత్త్వవాదులు, ఇస్లాం వల్ల క్రైస్తవ మత దేశాలకు కలిగే ముప్పులో భాగంగా మారారు. ఇదీ, పశ్చిమ దేశాల శత్రువుగా వున్న కమ్యూనిస్టుల ప్రాబల్యం తగ్గిన తర్వాత ప్రపంచ పరిస్థితి.

నేడు, పశ్చిమ దేశాలకు శత్రువుగా కమ్యూనిస్టుల స్థానంలో ఇస్లాంను నిలిపారు. ఇస్లాంకు సైద్ధాంతిక సవాలు ప్రతిపత్తిని ఆపాదించారు. అంతేగాక అది ప్రపంచ శాంతికి భంగం కలిగించే శక్తిగా కూడా చూడబడుతుంది. గతంలో నాటో, సెక్రటరీ జనరల్‌గా పనిచేసిన ఏల్లీక్లాస్ (Willey Claes) దృష్టిలో, "గతంలో

కమ్యూనిజంలాగా, నేడు ఇస్లాం పశ్చిమ దేశాలకు ప్రమాదకారిగా పరిణమించింది". అప్పుడే, 'ఇస్లాం మతతత్త్వవాదాన్ని' యెదుర్కొనడానికి, నాటో, 'ఇజ్రాయిల్, ఈజిప్టు, ట్యునీషియా, మొరాకో, అల్జీరియా వంటి దేశాలతో ఉమ్మడి యుద్ధ తంత్ర ఒప్పందం కుదుర్చుకొనింది కూడా. ఇప్పుడు, ఇస్లాంకు వ్యతిరేకంగా ప్రచ్ఛన్న యుద్ధం జరుగుతోంది. పశ్చిమ దేశాలలోని సాంప్రదాయవాదులు మరియు పెరుగు తున్న పోస్టుమాడరన్, పోస్ట్ సోవియట్ అభ్యుదయవాదులు ఈ ప్రమాదకరమైన అభిప్రాయాన్ని సమర్థిస్తున్నారు. 1993లో రాజనీతివేత్త శామ్యూల్ హంటింగ్టన్, బహుళ ప్రజాదరణ, ప్రభావం గల "ఫారన్ అఫైర్స్" (Foreign Affairs) అనే పత్రికలో 'సంస్కృతుల మధ్య సంఘర్షణ' అనే శీర్షికతో ఒక వ్యాసం రాశాడు. భవిష్యత్తులో సంస్కృతుల మధ్య తలెత్తే వివాదాలు ప్రపంచంలో యెక్కువవుతాయనీ, అందువల్ల పశ్చిమ దేశాలు, పాశ్చాత్యీకరింపబడిన దేశాల్లో ఈ ప్రమాదాలను యెదుర్కోవాలని పిలుపునిచ్చాడు : చాలామంది విమర్శకులు ఈ వ్యాసాన్ని ఇస్లాంకు వ్యతిరేకంగా జరుప తలపెట్టిన క్రూసేడ్‌గా భావిస్తున్నారు. పై భావన పశ్చిమ దేశాల్లో ముఖ్యంగా అమెరికాలో అనుకూల ప్రాచుర్యం పొందింది.

ప్రసార సాధనాల గుత్తాధిపత్యం :

ఈ విధంగా ఇస్లాంను ఒక దుష్ట శక్తిగా చిత్రీకరించడమనేది కేవలం పశ్చిమ దేశాలకే పరిమితమయ్యింటే అంత ప్రమాదకరంగా పరిణమించేది కాదు. క్రూసేడ్ల (పవిత్రయుద్ధాల) కాలంనుండి ఆ దేశాలు ఇస్లాంను ప్రమాదకారిగా యెటూ పరిగణి స్తూనే వున్నాయి. అయితే వార్తల వ్యక్తీకరణలు, నేడున్న ఎలక్ట్రానిక్ సామ్రాజ్య వాదంవల్ల, కేవలం పశ్చిమ దేశాలపైనే ప్రభావం చూపవు. ప్రసార సాధనాలపై అమెరికన్, పశ్చిమ దేశాల గుత్తాధిపత్యం వల్ల ప్రపంచంలోని అన్ని దేశాలపై ఈ అబద్ధపు ప్రచారం ప్రభావం చూపుతుంది.

అంతర్జాతీయ టెలివిజన్ వార్తలను యెక్కువగా. పాశ్చాత్య వార్తా సంస్థలు అన్ని దేశాలకు పంపుతూ వుంటాయి. ఎడిట్ చేయని టి.వి. చిత్రాలు (Raw footage), అలాగే పూర్తి చేయబడిన వార్తలు రెండూ పాశ్చాత్య వార్తా సంస్థల ద్వారా అందుతాయి. వీటికుదాహరణలుగా రాయిటర్స్ టెలివిజన్ ప్రపంచ వ్యాప్త టెలివిజన్ న్యూస్, ఎ.పి.టి.వి; శాటిలైట్ మరియు కేబుల్ ఆధారిత

సంస్థలైన సి.ఎన్. ఎన్; స్కై బి.బి.సి; వాయిస్ ఆఫ్ అమెరికా లాంటివి బి.బి.సి. వరల్డ్ సర్వీస్ తన వివిధ భాషలకు చెందిన ప్రసారాల ద్వారా ప్రపంచంలోని వాయుతరంగాలపై ఆధిపత్యం కలిగివుంది.

ప్రపంచంలోని అతి పెద్ద వార్త సంస్థలలో మొదటి నాలుగు స్థానాలను ఆక్రమించిన అసోషియేటెడ్ ప్రెస్, యునైటెడ్‌ప్రెస్ ఇంటర్నేషనల్, రాయిటర్స్ మరియు ఎ.ఎఫ్.పిలలో మొదటి మూడు ఆంగ్లో అమెరికన్ సంస్థలు. ప్రపంచంలోని 80% వార్తలపై ఈ నాలుగు సంస్థలకు ఆధిపత్యముంది. ఇతర దేశాల ఉద్యోగ బృందం, ఈ వార్తా సంస్థలలో పనిచేస్తున్నప్పటికీ ఉద్దేశ్యపూర్వకంగానో లేక ఉద్దేశ్యరహితంగానో ఈ కంపెనీల పశ్చిమ దేశాలు ముఖ్యంగా ఆంగ్లో-అమెరికన్ ఆలోచనా విధానాన్నే ప్రోత్సహిస్తున్నారు.

దక్షిణ భారతదేశంలోని వార్తా పత్రికలు, ముఖ్యంగా దేశంలోని అన్ని ఆంగ్ల పత్రికలు, మేగజైనులు గొప్పగా క్రమం తప్పకుండా సిండికేట్ ఏర్పాటు వల్ల, పశ్చిమ దేశాల వార్తా పత్రికలలో, మేగజైన్లలో ప్రచురింపబడిన వాఖ్యానాలను, ఫీచర్లను ప్రచురిస్తుంటాయి. ఆ విధంగా, పాశ్చాత్య దేశాల ప్రయోజనాలకనుకూలమైన ప్రపంచ వ్యాప్త వార్తా సరళిని ప్రారంభించి, అభివృద్ధి చేయడంలో పాశ్చాత్య వార్తా సంస్థలు ప్రముఖ పాత్ర వహిస్తున్నాయి.

దక్షిణ భారతదేశంలోని, చాలామంది జర్నలిస్టులు, ముఖ్యంగా ప్రాంతీయ మీడియాలోని కులీన (elite) వర్గాలవారు పాశ్చాత్య వార్తా పత్రికలను తమ వార్తా కథనాలకు ఆధారంగా స్వీకరించడమేగాక, విదేశీ వార్తల భాషను, శైలినీ, వాటి వార్తల విలువల్ని (News values) అనుకరిస్తున్నారు కూడా. అలా చేయడం మనకేమాత్రం తగదనీ మన సమాజంలోని సంక్లిష్ట సమస్యలను అర్థం చేసుకొనడానికి ఉపయోగపడదని తెలిసికూడా వారు అలా చేస్తున్నారు. ఉదాహరణకు ఇస్లామేతర దేశాలయిన ఆఫ్రికన్, లాటిన్ అమెరికా దేశాలలో, ఇండియాలో ఇస్లాం మత దురభిమాన వార్తల ప్రచారాన్ని పరిశీలించండి. 1994లో భారత ప్రధాని పి.వి. నరసింహారావు అమెరికా పర్యటన చేస్తున్నపుడు "ఇండియా టుడే", "ప్రపంచవ్యాప్త ఇస్లాం మత దురభిమానం టెర్రరిజంను ఎగుమతి చేస్తూంది'' అనే శీర్షికతో 20 పేజీల వ్యాసాన్ని ప్రచురించింది. ఆ వ్యాసం, మిలిటెంట్ ఇస్లాం వల్ల భారతదేశానికి కలిగే ఊహాజనిత ప్రమాదాన్ని పేర్కొనింది.

అయితే యిప్పుడు ప్రశ్నమేమిటంటే, యెందుకు ఇస్లాం ఈ దుష్ప్రచారాన్ని జరగనిస్తుంది ? అనేదే. అంతేగాక యెందుకు ముస్లింలు తమవైపు వాదాన్ని మంచి నేర్పుతో యితరులను ఒప్పించే విధంగా వినిపించలేకపోతున్నారు? పాశ్చాత్య మీడియాకు ప్రపంచ వ్యాప్తమైన ప్రభావం వుంది. నిజమే కాని ఇస్లాం దేశాల మీడియా కనీసం తమ దేశాల్లోనూ నమ్మకాన్ని కల్గించలేకపోతున్నాయి. ఇస్లాం దేశాలు తమ మధ్య నెలకొన్న సఖ్యత, స్నేహం గురించి గొప్పలు చెప్పుకుంటున్నప్పటికీ, చాలా అరబ్ దేశాలు, విషయ పరిజ్ఞానంతో కూడిన అరమరికలు లేని వార్తల చర్చను అనుమతించవు. అందువల్లనే ప్రపంచ దేశాల గురించి, పాశ్చాత్య దృక్పథమే యిప్పటికీ చెలామణి అవుతున్నది.

అన్ని ఇస్లాం దేశాలకు సంబంధించిన వార్తా సంస్థలకు విశ్వసనీయతలేదు. అందువల్ల వాటిని అభివృద్ధి చేయడం సాధ్యం కాలేదు. అరబ్ దేశాల రాజధానుల్లో, ప్రజాస్వామ్యాన్ని బలపరచే చర్యలను, బహుపార్టీ విధానాన్ని, అక్కడి నిరంకుశ రాజులు అనుమతించక పోవడంతో ప్రముఖ ముస్లిం వార్తా పత్రికలు లండన్, పారిస్‌ల నుండి ప్రచురింపబడుతున్నాయి; చాలామటుకు ఇస్లాం దేశాల్లోని జర్నలిజం అధికార రాజకీయం చేతుల్లో వుండి, పాలకుల వైపు మొగ్గుచూపుతుండటం విచారకరం. ఇస్లాం సమాజంలో, సాంస్కృతిక, రాజకీయ, ఆర్థిక ప్రాముఖ్యత కలిగిన విషయాలపై స్వేచ్ఛగా చర్చించగలిగేందుకు ఒక బహిరంగ చర్చావేదిక నేర్పాటు చేయడం నేడు అత్యంత అవసరమైంది.

అరబ్‌లీగ్ సభ్యదేశమైన లెబనాన్‌ను ఇజ్రాయిల్ తుక్కుతుక్కు చేస్తున్నపుడు యే అరబ్ దేశంకూడా అనునయ వాక్యాలు వల్లించడం తప్ప మరేమి చేయలేదు. (కనీసం పరామర్శించలేదుకూడా) దౌత్యపరమైన పనులన్నిటినీ పాశ్చాత్య దేశాల వారే చేశారు. క్వానా కాంప్‌ను (లెబనాన్‌లో) సందర్శించిన ఒకే ఒక విదేశీ ప్రముఖుడు ఫ్రెంచి విదేశీ వ్యవహారాల మంత్రి. లెబనాన్‌పై ఇజ్రాయిల్ బాంబుల వర్షం కురిపిస్తున్నపుడు, అమెరికాలో నివసిస్తున్న పాలస్తీనా రచయిత ఎడ్వర్డ్ సయీద్ 'గార్డియన్' (లండన్) పత్రికలో యిలా రాస్తాడు "మనం యిప్లే ఉపన్యాసాలు యిస్తూ, పగ గురించి కబుర్లు చెబుతూ వుంటాం. అంతేగాని, గత 5 దశాబ్దాలుగా, మన స్వాతంత్ర్యాన్ని, (సార్వభౌమాధికారాన్ని) ఇజ్రాయిల్ హరిస్తుంటే మన ప్రజలను ఊచకోత కోస్తుంటే, మన సైనికాధికారులను, సైనికులను

అవమానపరుస్తూంటే మన దేశాలను ఆక్రమించి వలసలుగా మారుస్తుంటే మనం యెందుకని చూస్తూ ఊరకే యెందుకున్నాం ?" అని అరబ్ దేశాలను ప్రశ్నించాడు.

చాలా ఇస్లాం దేశాలలోని మీడియాలో విమర్శనాత్మక స్పృహ లోపించింది. దాన్ని అలవరచుకోవడం నేడు ముస్లిం ప్రపంచంలోని జర్నలిజం చేయవలసిన మొదటి కర్తవ్యం. దీని ఆవశ్యకత గతంలో కంటే, మారిన నేటి పరిస్థితులలో యెక్కువగా వుంది. నేడు ఇస్లాంను పశ్చిమ దేశాలవారు ప్రపంచానికి ప్రధాన శత్రువుగా చిత్రీకరిస్తున్నారు. రానురాను ఈ ప్రచారం మరింత యెక్కువ కాబోతుంది. మధ్య ఆసియాలో పెట్రోలియంపై ఆధిపత్యం సంపాదించడానికి ఆ ప్రచార ధోరణి పశ్చిమ దేశాలకు అవసరం. ఆ క్రమంలో పశ్చిమ దేశాల పెట్రోలియం కంపెనీలకు రష్యా మరియు మధ్య ఆసియాలో కొత్తగా స్వాతంత్రం పొందిన ముస్లిం దేశాలకు మధ్య ఘర్షణ అనివార్యం అవుతుంది. అపుడు ఇస్లాంను దుష్టశక్తిగా చిత్రీకరించడం పాశ్చాత్య దేశాల ప్రయోజనాల కనుకూలంగా వుంటుంది. యావత్ ఇస్లాం దేశాల మరియు దక్షిణ దేశాల మధ్యనే వార్తల మార్పిడివల్ల పాశ్చాత్య వార్తా సంస్థలపై ఆధారపడాల్సిన అవసరం తగ్గుతుంది. దీనివల్ల సమాంతరంగా, ప్రజాస్వామికంగా ఆసియానుండి ఆఫ్రికాకు, లాటిన్ అమెరికా నుండి అరబ్ దేశాలకు మధ్య వార్తా ప్రసారాలు మొదలై పశ్చిమ దేశాల ప్రచారాన్ని యెదుర్కొనే వీలు కలుగుతుంది.

పై దీర్ఘకాలిక ఆశయాన్ని సాధించాలంటే రాజకీయ నిర్ణయాలు అవసరం. అంతేగాక ప్రసార సాధనాల వ్యవస్థ జాతీయంగానూ, అంతర్జాతీయంగానూ యెలా పనిచేస్తున్నదో విమర్శనాత్మకంగా తెలుసుకోవల్సిన అవసరమూ వుంది. "ప్రపంచ వ్యాప్త పొగరుబోతుతనం" (global arrogance)గా అయతుల్లా ఖుమేని పేర్కొన్న ఈ పశ్చిమ దేశాల ప్రసార సాధనాల దాడిని యెదుర్కొనడానికి దీనికన్నా సులభతరమైన మార్గముంది. అంతిమ విశ్లేషణలో పెట్టుబడిదారీ దేశాలలో ప్రసార సాధనాలనేవి ఒక వ్యాపారం. ఇతర వ్యాపారాలలోలాగే, వీటికి కూడా లాభాపేక్ష వుంది. అధిక భాగం పాశ్చాత్య ప్రసారసాధనాల వార్తలను, రోజూ పెరుగుతున్న అంతర్జాతీయ మార్కెట్‌లో అమ్మకం పెడుతున్నందువల్ల, మనం కొనుగోలు దారులుగా అదుపు నవలంబిస్తే కార్యసాధకంగా వుంటుంది కదా ? చాలా అభివృద్ధి చెందుతున్న దేశాల ప్రభుత్వ గ్రంథాలయాలు "టైమ్స్", "న్యూస్

వీక్", "ఎకానమిస్ట్" పత్రికలకు చందాలు కడుతున్నాయి. బీదదేశాలు యెందుకు యిలాంటి పాతిక, అర్థ, అసత్యాలను చదవడానికి డబ్బును ఖర్చుచేయాలి? స్వాతంత్ర్య పోరాట కాలంలో విదేశీవస్తు బహిష్కరణకు పిలుపు నిచ్చినట్టుగా, ఆ బహిష్కరణను ఒక ఆయుధంగా వాడి పాశ్చాత్య ప్రసార మాధ్యమాలకు గుణపాఠం చెప్పాలి.

పాశ్చాత్య దేశాల ప్రసార మాధ్యమాలు ఇస్లాంను నాగరిక ప్రపంచానికి శత్రువుగా ప్రచారం చేస్తున్నాయి. ఇలా చేయడం, ఆ యా దేశాల భౌగోళిక, రాజకీయ అవసరాలయిన ఆయుధాల అమ్మకం, చమురుగనులపై ఆధిపత్యం కొనసాగించడానికి ఉపయోగపడుతుంది. కమ్యూనిస్టు దేశాల పతనం తర్వాత, ఇస్లాంను పాశ్చాత్య దేశాల భద్రతకు ముప్పుగా ప్రచారం జరుగుతోంది. అందువల్ల నేడు ఇస్లాం దేశాల ప్రసార మాధ్యమాలు, విదేశీ వార్తా సంస్థలపై ఆధారపడటం తగ్గించాలి. అందుకవసరమైన కొత్త విధానాలు, పద్ధతులు ఇస్లాం దేశాలు రూపొందించుకోవల్సిన అవసరం యెంతైనా వుంది.

— దయా కిషన్ తుస్సు

(1997 ఫిబ్రవరి 8-14 నాటి 'ఎకనామిక్ అండ్ పొలిటికల్ వీక్లీ'లో వచ్చిన "How Media Manipulates Truth about Terrorism" అనే వ్యాసానికి స్వేచ్ఛానువాదం)

—సి.పి.ఎస్. రావు

---

## ఆవేదన

ఈ సమాజానికి పంచభక్ష్య పరమాన్నాలు పెట్టి
గొడ్డుమాంసం, గొడ్డుకారం తిని బతికినోళ్లంకదా తల్లీ
మీ అందరికీ చెప్పులు కుట్టిచ్చి
మేం చెప్పులతో కొట్టించుకున్నవాళ్ళం కదమ్మా
మా దళిత కవిత్వంలో మా ఆకలీ, మా ఆవేదన, మా బాధలపరించే తప్ప
నెమలి తల్లి నాట్యాల గురించీ, పాల పిట్టల కూతల గురించీ
చెప్పటం మాకేడ చేతనయిద్ది తల్లీ
కవిత్వాన్ని సుకుమారంగా చెప్పటానికి
మా దళిత కవిత్వం
మీ లలిత కవిత్వం కాదుగా

—మసిబొగ్గు

యథానిక

# వాడగోడు

అక్కడ ఓ యుద్ధం తర్వాత మిగిలిన శ్మశాన నిశ్శబ్దం !

అక్కడ ఓ యుద్ధం సన్నాహానికై పొంచిన ఉద్విగ్న నిశ్శబ్దం !

ఆ దళితవాడను చూద్దామని వెళ్ళిన నేను ఇంకా దట్టంగా వ్యాపిస్తూనే వున్న పొగల మధ్య, ఇంకా చల్లారని నిప్పుల సెగల మధ్య, శిథిలమై నిలిచిన మొండి గోడల మూగ ఆర్తనాదాల నడుమ— చేతలుడిగిపోయి నిల్చుండిపోయాను. కళ్ళ ముందు పచ్చని జీవితం పగిలి పచ్చిపుండై సాక్షాత్కరిస్తుంటే నేను వట్టి శిలనై పోయాను. కన్నీటి సెలనైపోయాను.

చుట్టుముట్టిన చావు సంగీతం లాంటి ఆ భయంకర నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ ఎక్కడ్నించో సన్నని శబ్దం. అచేతనమైపోయిన నా దేహం ఒక్కసారిగా జలదరించింది.

ఎముకల మూలగల్లోంచి వస్తున్న చలిజ్వరం లాంటి మూలుగు, కాదు కాదు వంటిని కంపరమెత్తిస్తున్న దైన్యమైన పిలుపు, పెనుగులాట, చిట్టచివర శ్వాసలాంటి ఎక్కిళ్ళ శబ్దం, కళ్ళను మండిస్తున్న పొగతెరలను చీల్చుకొని చూశాను.

ఆ ఆరీఆరని నిప్పుల నడుమనుంచి నావైపే నడిచివస్తూ ఓ ముసలివగ్గు !

భయకంపితమైపోయాను ఆ ఆకారాన్ని చూస్తూ

నిలువెల్లా దగ్ధమైపోయి కమురు కంపుకొడ్తూ—

ఆరిన చితిలో ఇంకా ఆరని నిప్పు మెరుపు ఎరుపులా ఆమె.

భయం, భీతి, నిస్సహాయత ఘనీభవించిన శోకశిల్పంలా ఆమె.

దారిద్ర్యపు మంటలకు మసిబారిపోయి మిగిలిన నుసిలా ఆమె.

యాభై ఏళ్ళుగా ఎగిరీ ఎగిరీ జీర్ణమైపోయిన జాతీయపతాకంలా ఆమె.

వెలకట్టబడ్డ ప్రాణంలా, ఎప్పటికీ వెలకట్టలేని నెత్తురులా ఆమె.

"ఎవరమ్మా నీవు ?" పెగలనంటున్న గొంతును పెగుల్చుకుంటూ నన్ను సమీపించి, దయనీయంగా నావంకే చూస్తున్న ఆమె నడిగాను.

అతికష్టంతో రెండు చేతులూ ఎత్తి జోడిస్తూ— ఆకలిలా, దుఃఖంలా నెత్తురులా, చీములా, చితికిన బతుకులా ధ్వనిస్తున్న గొంతుతో—

"ఎవరిబిడ్డవోగానీ తల్లీ ! నీకు దండాలమ్మా, నన్ను చూడ్డానికీ, నా గోడు

విండానికొచ్చిన మాతల్లీ నీకెయ్యి దండాలమ్మ! నన్ను గుర్తుపట్టలే, నేనమ్మా నిన్నటిదాకా ఇక్కడే బతికినదాన్ని, ఇదుగో ఈ మొండి గోడలమధ్యే, ఈ బూడిద కుప్పలున్న చోటే బతికిన దాన్నమ్మ వందల మంది బిడ్డల తల్లినమ్మ, నేనమ్మ ప్రకాశం జిల్లాలోని 'ఎగువ చెర్లోపల్లి' దళితవాడనమ్మ!" వెక్కి వెక్కి ఏడుస్తూ అంది.

నిరుత్తరురాలినై పోయాను
దళితపల్లె
నేను చూద్దామనొచ్చిన దళితపల్లె

పల్లె తల్లై నా ఎదుటకొచ్చి గోడు గోడున ఏడుస్తూ తన గోడు చెప్పుకుంటుంది.

అవును నిజంగా నిన్నటిదాకా ఇక్కడో పల్లె వుండేది, పల్లవించే పైరు పాట వుండేది, పచ్చని బ్రతుకులుండేవి, చెదిరిన తాటి కమ్మల కప్పుకిందైనా చిక్కగా అల్లుకున్న ప్రేమలుండేవి, ఏ పూటా సరిగా కడుపు నిండకపోయినా నా రేపటి పూట గురించి వెచ్చని కలలుండేవి. కానీ ఇప్పుడేమిటిలా? పచ్చని బతుకుల స్థానే పీనుగులపెంట, వెచ్చని కలల స్థానే బూడిద కుప్పలు, అసలేం జరిగింది?

నిలువెల్లా కన్నీరై నా ఎదుట నిలుచున్న ఆ తల్లిని చూశాను.

కాలిపోయిన రావిచెట్టు ఆకులా అల్లల్లాడిపోతున్న ఆ తల్లిని ఒక్క వుదుటున ముందుకు దూకి నా చేతుల్లో పొదువుకున్నాను. నా గుండెలకు హత్తుకున్నాను, నా గుండెల్లో నింపుకున్నాను. నా గుండె దిటవు చేసుకొని ఓదార్చాను.

"అమ్మా! నేను నీ బిడ్డను, నీ దానిని, నీలో ఒకదానిని అసలేం జరిగిందో చెప్పమ్మా!"అడిగాను.

ఆ తల్లి తలెత్తి నా మొఖం చూసింది.

కన్నీటి చూపుల్తోనే నా వళ్ళంతా పుణికింది.

దుఃఖంతో గడ్డ కట్టుకుపోయిన తన గొంతు నిప్పింది

"బిడ్డా ఏం చెప్పమంటావ్ ? నా కథనేమి చెప్పమంటావ్? ఆ రోజు జరిగిన ఘోరాన్నెలా చెప్పమంటావ్ ? బిడ్డా ! ఈ దేశానికి సొతంత్రం వచ్చి యాభై ఏళ్లు నిండాయి అంటూ దేశమంతా పండగలు చేసుకుంటున్న దినాల్లోనే

బడిముందు, ఊరి నడుమ ఎగుర్తున్న ఆ మూడు రంగుల జెండా సాక్షిగా అగ్రకుల పోళ్ళు నన్ను నిలువునా తగలబెట్టారు. ఊరి చివరగా ఇసిరేసినట్టున్న నా మీదకు గుంపులు గుంపులుగా దాడిచేసిన మదమెక్కిన రెడ్డి భూసాములు చేతికి అందిన నా బిడ్డలను చేతికందినట్టు కర్రలతో గొడ్డళ్ళతో కొట్టారు. మేకలమందలో పులిపడ్డట్టు చెల్లా చెదురైపోయిన నా బిడ్డలను కొండల్లోకి తరిమి తరిమి కొట్టారు. ఆడవాళ్ళని కూడా చూడకుండా ఈడ్చి ఈడ్చి కొట్టి వాళ్ళతోనే ఇళ్ళల్లోంచి నిప్పుకట్టెలు తెప్పించి వాళ్ళ ఇళ్ళను వాళ్ళతోనే తగలబెట్టించారు. చేతికందిన సామాన్లతో, బట్టల మూటలతో పారిపోతున్న నా బిడ్డల చేతుల్లోంచి వాటిని లాక్కొని మంటల్లోకి విసిరేశారు. ఇంకా ఏం చెప్పను బిడ్డా! అయ్యో నా పేగు కాలిన కబురును నేనే ఎట్టా చెప్పుకోను నా కడుపు కోతను నేనే ఎట్టా చెప్పుకోను. నా బిడ్డ సామియేలు, నా అవిటిబిడ్డ సామియేలు కాలిపోతున్న ఇంటిలోంచి బయటకొస్తుంటే మంటల్లోకి నెట్టి తగలబెట్టేశారు, ఆ కసాయోళ్ళు నా బిడ్డను పొట్టన బెట్టుకున్నారు. తలలు పగిలినోళ్ళు, చేతులిరిగినోళ్ళు, ఒళ్ళుకాలినోళ్ళు, కట్టెల దెబ్బలతో నడవలేనోళ్ళు, ముసలోళ్ళు, ఆడోళ్ళు, పిల్లాపాపలందర్నీ కొండల్లోకి తరిమి తరిమికొట్టారు. అయ్యో! అయ్యో పెదబాబుల్లారా ఆగండయ్యా ! మా బతుకుల్ని ఆగం చేయమాకండయ్యా, నా గుడిసెలు తగలబెట్టమాకండయ్యా అంటూ కాళ్లు పట్టుకొని వేడుకున్నాను, మొత్తుకున్నాను, నెత్తీనోరూ బాదుకున్నాను. కానీ కండకావరమెక్కిన ఆ రెడ్డి దొరలకు నా గోడు పట్టలే, నన్ను మాడ్చి మసిచేశారు. నా నుండి నా బిడ్డల్ని తరిమి కొట్టారు. నన్ను దిక్కులేనిదాన్ని చేశారమ్మా!" ఇక చెప్పలేక ఏడుపు తెరతో ఉక్కిరిబిక్కిరై ఆగిపోయింది. కాసేపటికి తేరుకొని తానే మొదలెట్టింది.

"తల్లీ ఇదంతా దేనికోసమో తెల్సా ? ఇంత దారుణం ఎందుకు జరిగిందో తెల్సా? బాబుల్లారా ! మాకూ ఓ పిడికెడు భూమి నిమ్మన్నందుకు మాకూ ఓ జానెడు జాగా నిమ్మన్నందుకు దేముడు మాన్యాన్ని ఇన్నాళ్ళుగా మీరే అనుభవిస్తున్నారు. ఇకైనా మాక్కూడా తలాకాస్త ఇమ్మని అడిగినందుకే బిడ్డా! అలా అడగడమే పాపమైంది బిడ్డ. ఈ దేశానికి సొతంత్రం వచ్చి యాభై ఏళ్ళయిందంట. కానీ నేనెప్పుడూ దాన్ని చూసి ఎరగను. నెనెప్పట్నించో ఊరికి చివరగా ఇలా ఇసిరేయబడే వున్నాను, వెలేయబడే వున్నాను. ఈ కప్పులు చెదిరిన గుడిసెల్లోనే వుంటున్నాను. ఊరోళ్ళ చచ్చిన గొడ్డుల్నే తింటున్నాను. వాళ్ళ శవాల్ని మోస్తున్నా,

చెప్పులు కుట్టి దొరబాబుల కాళ్ళకు తొడుగుతూనే ఉన్నా రెడ్డోళ్ళ భూముల్ని నా చెమటతో తడిపి పంటలు పండించి వాళ్ళ గాదెల్ని నింపుతున్నా ఎప్పుడూ ఇదే బతుకు. ఏళ్ళ ఏళ్ళగా కాదు కాదు యుగాలు యుగాలుగా ఇదే బతుకు, వెట్టి బతుకు మట్టి బతుకు ఊరి చివర చెదిరిన బతుకు. నా బిడ్డలెప్పుడూ దొరల బానిసలే. తట్టుకోలేక 'ఇదేంది దొరా?'అన్నాడో నా బిడ్డ ఇక నాకు లేనట్టే. నా బిడ్డ చెప్పులేసు కుంటే తప్పు, ఆ పెద్ద కులపోళ్ళ ఎదురుగా కూకుంటే తప్పు నించుంటే తప్పు నాలుగు అక్షరం ముక్కలు నేర్చుకుంటే తప్పు. వంటిమీద కమిలిన దెబ్బలతో కుమిలిపోతూ వచ్చిన నా బిడ్డల్ని ఎన్నిసార్లు నా కడుపులో పెట్టుకొని కాచుకున్నా నని! చెయ్యని నేరానికి కూడా శిక్షించబడి ఊరి చివర చెరువులో శవాలై తేలిన బిడ్డల్ని చూసి ఎన్నిసార్లు కన్నీరుమున్నీరయ్యానని! మదమెక్కిన దొర కొడుకుల చేతుల్లో కుక్కలు చింపిన విస్తర్లయి, పొలాల్లో శవాలయిన నా ఆడకూతుళ్ళని చూసి ఎన్నిసార్లు గుండెచెరువులయ్యేట్టు ఏడ్చానని! ఇది బిడ్డా నా బతుకు, నా బిడ్డల బతుకు.

మూడు నాలుగేళ్ళకోసారి ఓట్ల పండగలొస్తాయ్. అప్పుడు నా పల్లెకు జీపు లొస్తాయ్, జెండాలొస్తాయ్ తెల్ల తెల్ల బట్టలేసుకున్న ఏనుగుల్లాంటి మనుషులొస్తారు. ఇంటింటికీ తిరిగి దండమెడ్తారు. మీకు గొర్లు ఇస్తామంటారు; బర్లు ఇస్తామంటారు. భూములిస్తామంటారు. అదేంటోగాని ఆనాట్రోజులు మేం పండగొచ్చినప్పుడు పబ్బతి పట్టే పెద్ద కులపోళ్ళం అయిపోతాం. ఊళ్ళోని రెడ్డి దొరలు ట్రాక్టర్ల మీద మమ్మల్ని మళ్ళేసి తీసుకుపోయి ఓట్లు గుద్దించుకుంటారు. ఆ తర్వాత మళ్ళీ ఓట్ల పండగ దాకా ఎవడూరాడు. మా మొఖాలు చూడడు. అప్పుడప్పుడు జీపుల్లో ఎవరెవరో వస్తారు. మా పేర్లు పెట్టి పిలిచి కాయితం ముక్క చేతుల్లో పెట్టి నీకు భూమిచ్చాం దున్నుకోండి అంటారు. ఆ కాయితం మీదే కాని మా కళ్ళతో మేం ఎప్పుడూ చారెడు భూమిని చూళ్ళేదు, నాగలితో దున్నలేదు. అట్టా మా కిచ్చిన భూముల్ని కూడా పెద్దోళ్ళే సాగు చేసుకున్నారు. మా భూముల్లో మేమే కూలోళ్ళయ్యాం

అట్టాగే చీకట్లోనే ఒంగిలిపోతున్న మా బతుకుల్లోకి వచ్చని అడవుల్లోంచి వెచ్చని వెలుగొచ్చింది. ఎంత చక్కని వెలుగనుకున్నావ్ ఎర్రపూల మెరుపది, వెన్నెలవాగు పొంగది. ఆ వెలుగుల్లో నా బిడ్డలు అక్షరాలు దిద్దుకున్నారు. అను పానులు తెల్సుకున్నారు. ప్రపంచం ఎట్టాపోతుందో అర్థం చేసుకున్నారు. ఇంక

దొరలకింక ఎందుకు అణగి మణిగి ఉండాలన్నారు. ఆ దొరల కాడికి పోయి మా భూములు మాకివ్వండన్నారు. అంతేకాదు దేవుడు భూములు గవర్నెమెంటు భూము లేగా మేమూ దున్నుకుంటాం అన్నారు ఎర్రజెండాలు పాతారు. ఆ భూముల్లో నాగళ్ళు కట్టారు. నా బిడ్డల తెగువుకి, నేనే కాదు ఆ నేల తల్లి కూడా పులకరించి పోయింది కానీ దొరలు మాత్రం కాళ్ళ కింద దుమ్ము కంట్లో పడ్డట్టు ఎగిరెగిరిపడ్డారు. మీ అంతు చూస్తాం, మీ ఎనకున్నోళ్ళ అంతూచూస్తామని రంకిలేసారు. కేసులు పెట్టారు. పోలీసులొచ్చారు. నా బిడ్డల్ని పట్టుకుపోయి కొట్టారు. కోర్టులెంట తిప్పారు. కళ్ళు చల్లబడని రెడ్డి దొరలు పల్లె మీద కచ్చి కట్టారు. నా బిడ్డల్ని ఊరిమధ్య కట్టేసి కొట్టారు. అయినా సరే చచ్చినా సరే మా భూముల్ని మేం వొదలమన్నారు మా బిడ్డలు. చివరకు మా పల్లె మీద పగబట్టిన రెడ్డి దొరొకడు పడాల్సిన వాళ్ళ చేతుల్లో పడి చావాల్సిన చావు చచ్చాడు. ఇక ఆ సాకుతో ఎప్పుడు వీలు దొరుకుతుందా అని చూస్తున్న ఆ దొంగ లొత్తు కొడుకులు నా మీద పడి అగం అగం చేశారు. తగలబెట్టారు. నా బిడ్డల్ని తరిమికొట్టారు. నా ఉసురు నా బిడ్డల ఉసురు పోసుకున్నారు.

ఇక అంతా అయిపోయాక తెల్లబట్టలోళ్ళొచ్చారు, పోలీసులొచ్చారు. మంత్రు లొచ్చారు. నన్ను చూసి అంతా అన్యాయం జరిగిపోయిందన్నారు. న్యాయం చేసి తీర్తామన్నారు. నా బూడిద పట్టుకొని బోరున ఏడ్చిన మంత్రి మధ్యానం పెద్ద రెడ్డి గారింట్లో కోడికూరతో బువ్వ తినడం నేను చూశాను. ఈళ్ళా నాకు న్యాయం చేసేది. పటాలాలు, పటాలాలు పోలీసులొచ్చారు. ఊళ్ళో మకాం వేశారు. నన్ను తగలెట్టి, నా బిడ్డను పొట్టనెట్టుకున్న ఆ రెడ్డి కొడుకులు ఆళ్ళముందే కుశాల కుశాలగా తిరుగుతున్నాకానీ ఆళ్ళనేం చెయ్యలే. కాని పోలీసోళ్ళు మాత్రం కొండల్లో గుట్టల్లో పరారై పోయిన నా బిడ్డలకోసం,ఆళ్ళకంటి వెలుగుల కోసం గాలిస్తు న్నారు. తెల్సాబిడ్డా ఆ పోలీసోళ్ళ సాక్షిగానే,ఆళ్ళ కళ్ళెదుటే నాలో మిగిలిన నాలుగు గుడిసెల్ని మళ్ళా తగలెట్టారు. అయినా పోలీసులేం చెయ్యలా, ఆళ్ళిళ్ళల్లోనే తింటూ తాగుతూ ఆళ్ళతోనే తిరుగుతున్నారు. అర్థమవుతుంది బిడ్డా! ఏది ఏమిటో ఎందుకో నాకిప్పుడిప్పుడే అర్థమవుతుంది. ఒక్కొక్కళ్ళ సంగతి నాకిప్పు డిప్పుడే తెలుస్తుంది. అట్టాగే నేనేం చెయ్యాలోకూడా నాకిప్పుడిప్పుడే తెలుస్తుంది. చెట్టుకొకరు పుట్టకొకరై పోయి కొండల్లోకి, గుట్టల్లోకి, వాగుల్లోకి, వంకల్లోకి

పరుగులెత్తిన నా బిడ్డలేమైపోయారో ? ఎక్కడున్నారో ? ఏం తింటున్నారో ? నా బిడ్డల ఆచూకీ చెప్పు తల్లీ ! అళ్లు ఎక్కడైనా కనిపిస్తే ఆళ్లకి చెప్పమ్మ 'మీ యమ్మ మీకోసం గోడు గోడున ఏడుస్తుందని, మీ వాడ పొలిమేరల్లోనే ఎదురు చూస్తుంద'నీ ఆళ్లకి చెప్పమ్మ పిరికివాళ్లు కావద్దని, దెబ్బలు తినటం మనకు కొత్త కాదని, అట్టాగే దెబ్బతీయడం కూడా మన కెవ్వరూ నేర్పక్కర్లేదని చెప్పు, రొమ్మిరుసుకుని నిలబడి దెబ్బకు దెబ్బ తియ్యాలని చెప్పు. ఈ భూమే మన ఉనికి ఊపిరి, ఈ భూమే మన జవం, జీవితం. అందుకే ఈ భూమి కోసం చచ్చేదాకా కొట్లాడవాం. గెలిస్తే బతుకు పంట పండిస్తాం; చస్తే ఎరువవుతాం, రెండూ మనకిష్టమే, మన భూమికి లాభమేనని చెప్పు, నా గుండెల్లో మండుతున్న ఈ పెనుమంటను వూరు వూరుకీ వాడ వాడకీ పంచమను. కొత్త మంటలను రగల్చమని చెప్పు, ఈ బూడిద కుప్పల మీదే ఆత్మగౌరవపు పునాదులతో సరికొత్త ఇళ్లని కట్టుకుందాం రమ్మని చెప్పు ! ఈ మంటల్లో నిలువెల్లాకాలి వెన్ను పూసనే విల్లంబులుగా చేసి వుంచానని చెప్పు, ముంజేతి ఎముకల్ని గునపాలుగా, గండ్రగొడ్డళ్లగా మలచి వుంచానని చెప్పు, పక్కటెముకల్ని పట్టా కత్తులుగా పదునుపెట్టి వుంచానని చెప్పు. నా బిడ్డలను నాదరికి రమ్మని చెప్పు, మీయమ్మ మీ కోసం ఆయుధాలతో ఎదురు చూస్తుంది, కొట్లాడ్డానికి ధైర్యంగా రమ్మని చెప్పు తల్లీ !"

ఆ ముసలి తల్లి కళ్ళల్లో క్రోధాగ్ని జ్వాలలు, నిలువెల్లా ఆయుధాలు.

ఆమె గుండెకోతకు, కడుపుమంటకు నా నరాలు పటపట లాడి పదునెక్కాయి.

కసిగా బిగిసిన పిడికిలి దేనికోసమో ఆరాటంగా వెదుక్కుంటుంది.

వళ్ళంతా దేనికోసమో తపనతో నిలువెల్లా పదునెక్కుతోంది.

ఆ వాడ తల్లి గోడుకు నా సకల సంశయాలు పటాపంచలయిపోయి యుద్ధమొక్కటే మనల్ని గెలిపిస్తుందన్న నిజం నన్నో సైనికురాలిగా సాయుధం కమ్మంటోంది.

ఇంతలో వాడ వాడ కలిసి ఉప్పెన సంద్రమైనట్టు
ఊరేగింపు !
వేలకు వేలు
బాధితులు

దుఃఖితులు
ఈ దళిత తల్లి బిడ్డలు
మానవత్వమున్న మనుషులు
వేలకువేలు

అందరూ కలిసి ఊరిని ముంచెత్తే ఉప్పెన సముద్రంలా ఈ నల్లని నేలను చీల్చుకొని మొలకెత్తిన పచ్చని పైరు పాటలా ఊరేగింపు !

ఈ నేలకోసం నాగళ్ళు కట్టిన ఊరేగింపు !
బతుకు కోసం మెతుకు కోసం బడుగు బతుకు
లెత్తిన తిరుగుబాటు బావుటా !
ఊరేగింపు ! ఊరేగింపు ! !

నేలతల్లి బిడ్డల పదఘట్టనలతో దద్దరిల్లి పోతున్న అగ్రకులాహం కారపు కట్టడాలు, నింగిని తడుతూ మిన్నుముడుతున్న నినాదాల హోరు, మమ్మల్నొరుసుకు వెళ్తున్న ఊరేగింపు ఉప్పెన, పోరు వరద హోరు.

ఆ ముసలితల్లి మొఖంలోకి చూశాను
ఇప్పుడా మొఖంలో భయం లేదు, భీతి లేదు, ఏడుపు లేదు
అంతులేని వేదన లేదు

ఇప్పుడా తల్లి కళ్ళల్లో వెలుగు, గుండెల్లో మెరుపు మొఖంలో జీవకణాల సజీవ కదన నృత్యం. ఆమె మొఖం మీద విజయదరహాసం, కన్నబిడ్డల్ని కదన రంగాన కళ్ళార చూసుపన్న వీరమాత తృప్తి !

నేనిప్పుడు ఊరేగింపులో వున్నాను
నేనిప్పుడు ఉప్పెన అలనై వున్నాను
నా కంఠనాళాలు ఫెటేల్మని పెగిలి కణీల్మన్న నినాదం !
నా గొంతులో నినాదమై పెట్లిన ఆ దళిత తల్లిగోడు !
ఊరేగింపు సాగుతూనే వుంది
ఆ ఊరేగింపులో నేనూ సాగుతూనే వున్నాను.
అంతిమ విజయం దాకా....!
[యథానిక : యథార్థ సంఘటనకు కథానిక రూపం]

—ఎన్. కాంతి

ఇష్టాగోష్ఠి :

# సాహిత్యంలో సామాజిక దృక్పథం-
# డా॥ కేశవరెడ్డి అంతర్యం

[డాక్టర్ పి. కేశవరెడ్డి చిత్తూరుజిల్లా, తలుపులపల్లి (10 మార్చి, 1946)లో పుట్టారు. చదివింది తిరుపతి, పాండిచ్చేరి, వెల్లూర్ (C.M.C.)లలో. ఇరవై ఏళ్ళ నుంచీ ఉత్తర తెలంగాణా నిజామాబాద్ జిల్లా, డిచ్‌పల్లిలో మెడికల్ ఆఫీసర్‌గా పని చేస్తున్నారు.

"బానిసలు, భగవాను ఉవాచ' (1975), 'ఇన్‌క్రెడిబుల్ గాడెస్' ('77), 'స్మశానం దున్నేరు' ('79), 'అతడు అడవిని జయించాడు' ('85), 'సిటీ బ్యూటిఫుల్' ('86), 'రాముడుంటాడు, రాజ్జిం వుంటాది (1986)', 'చివరి గుడిసె, మూగవాని పిల్లనగ్రోవి' ('93) కాక మొదట్లో కొన్ని కథలు రాశారు. ఈయన రచనలు ఇతర భారతీయ భాషల్లోకి అనువాదాలవుతున్నాయి.

అట్టడుగు జీవితాన్ని ఆత్మీయతతో, ఆసక్తికరంగా రాస్తున్నారు.

కేశవరెడ్డి విశాఖపట్నం వచ్చినప్పుడు (నవంబరు 1996) విరసం, విశాఖ యూనిట్ ఏర్పాటు చేసిన సాహిత్య సమావేశంలో ఇష్టాగోష్ఠి. ఆయన చిత్తూరు యాసని దీన్లో పలికించలేకపోతున్నందుకు బాధగానే వుంది.]

1. మీ సాహిత్యాభిలాషకి నేపథ్యం ఏమిటి ?

జవాబు: నాకు బుద్ధి తెలిసిన దగ్గర్నుంచీ, అంటే తొమ్మిదో తరగతి నుంచీ రాస్తున్నా – కేవలం ఒక కుతూహలం – అచ్చులో పేరు చూసుకోవాలనే ఉబలాటం. అందుకే కొన్ని షార్ట్ స్టోరీస్ రాశాను. అవి గుర్తు కూడా లేవు. అదొక దశ.

మెడిసిన్ చదివినంతకాలం ఏమీ రాయలేదు. ఆ తర్వాత ప్రారంభించాను. నా చుట్టూ సమాజంలో జరుగుతూన్న విషయాలూ, అవి నాలో కలిగించిన స్పందనలూ, అనుభవాలూ, అనుభూతులూ, ఆలోచనలు– వీటన్నిటిని ఇతరులతో పంచుకోవాలనే 'ఒత్తిడి' వల్లనే రచనలు చేశాను. ఇది మరో దశ. అప్పటికి నాకు సమాజం గురించిన అవగాహన, ప్రక్రియల గురించి పట్టు చిక్కింది. ఒక ఉద్దేశంతో, ధ్యేయంతో రాస్తున్నా. బాల్య దశలో చూసిన

విషయాల్నే ఇప్పటిదాకా నా నవలల్లో చిత్రించాను. ఒక్క 'సిటీ బ్యూటిఫుల్' మాత్రం విద్యార్థి దశలో అనుభవాల ఆధారంగా రాశాను. నా వృత్తి జీవితంలో అనేక అనుభవాలున్నాయి. నా యౌవనంలోనూ, విద్యార్థి దశలోనూ బాగా గుర్తుండిపోయిన విషయాలే ఎన్నో వున్నాయి. వీటి ఆధారంగా చాలా థీమ్స్ కూడా వున్నాయి. బాల్యదశకి సంబంధించినవి ఇక ఆపేసి, ఈ దశల నవలలు రాస్తా. రాయాలి.

2. మీ ధోరణి, సిద్ధాంతం వివరిస్తారా ?

జ : నన్ను ప్రత్యేకించి ఒక ధోరణి రచయితగా చెప్పలేం. చెప్పుకోవాల్సి వస్తే మాత్రం వర్గ పోరాట ఆవశ్యకత, అనివార్యతల్ని సూచించే రచయిత గానే పరిగణించాల్సి వుంటుంది. అలాగే సిద్ధాంతంతో ప్రభావితమై రాసిన వాణ్ణి కాను. కాని మార్క్సిజం కొద్దిగానైనా తెల్సుకున్న మీదటనే నాకు స్పష్టమైన దృక్పథం వచ్చింది. సమాజాన్ని అర్థం చేసుకునే సామర్థ్యం వచ్చింది.

3. మీకు నచ్చిన రచన ?

జ : 'కన్యాశుల్కం'. నాకు తెల్సినంత వరకు తెలుగులో అంత గొప్ప పుస్తకం రాలేదు. అది నాకు భగవద్గీత లాంటిది. చదివేకొద్దీ మళ్ళీ చదవాలని పిస్తుంది. దాన్లోని సంభాషణా చాతుర్యం అలాంటిది.

4. మీ రచనల్లో మీకు నచ్చిన పాత్ర ?

జ : బైరాగి. నాకు తెలియకుండానే నా నవలన్నింటిలో ఈ పాత్రను పట్టు కొస్తున్నాను. బాల్యం నుండి బైరాగి జీవితం మీద నాకు ఆకర్షణ. Subconsciously I have a great affinity for the marginal man. వ్యక్తిగత ఆస్తి, స్వార్థం లాంటి విషయాల్లో వైరాగ్యం నన్నాకర్షిస్తుంటాయి. ఆస్తి, స్వార్థం పట్ల నాకున్న అయిష్టత వల్ల నాలో కొంత బైరాగి తత్వం కూడా వుండొచ్చు !

5. మీ కిష్టమైన రచయితలు ?

జ : మన గురజాడ, ఇంగ్లీష్‌లో స్టీన్‌బెక్, హెమింగ్వే.

6. మీ సాహిత్య కృషి గురించీ, మీ నవలల నేపథ్యం గురించీ చెప్తారా ?

జ : ఇప్పటి వరకూ 6 నవలలు రాశాను. రెండు పెద్ద కథలు కలిపి ఒక

పుస్తకంగా వచ్చింది. మొదట నేను రాసిన కథలకి వుబలాటమే గాని ఉద్దేశమేదీ లేదని చెప్పాగద ! 'ఇన్‌క్రెడిబుల్ గాడెస్' దగ్గర్నుంచీ ఒక దృక్పథంతో, నిశ్చితమైన ఎయిమ్‌తో, పర్‌స్పెక్టివ్‌తో రాస్తున్నాను. 'ఇన్‌క్రెడిబుల్ గాడెస్' దగ్గర్నుంచీ 'చివరి గుడిసె' వరకూ కూడా దళితుల్ని ఇతర వర్గాలు ఆర్థికంగానూ, సామాజికంగానూ ఎలా దోపిడి చేస్తున్నారో చిత్రించినవే. 'చివరి గుడిసె'లో యానాదులనే తెగవారు అగ్రవర్ణాలచేత దారుణంగా ఎక్స్‌ప్లాయిట్ చేయబడడం చెప్పాను. ఆ దోపిడి వల్ల యానాది జాతి దాదాపు అంతరించిపోతున్నదని పొందుపరిచాను (depict). 'మూగవాని పిల్లనగ్రోవి'— తరతరాలుగా భూమిని నమ్ముకుని బతుకుతున్న రైతు ఒక్కసారిగా భూమిని పోగొట్టుకున్నప్పుడు అతని మనసు ఎంత వికలమయిందీ చెప్పడానికి రాసిన నవల. ఆ ఇతివృత్తం చాలా పవర్‌ఫుల్‌గా చెప్పదలచుకుని మిస్టిక్‌స్టైల్‌లో చెప్పాను. 'అతడు అడవిని జయించాడు'లో మార్మిక శైలి కావాలనే వాడాను. వాతావరణం, సన్నివేశ కల్పనలో ఒక విధమైన గాంభీర్యం తీసుకురావడానికీ, పాఠకుల్ని కథాగమనం వెంబడి తీసుకుపోవడానికీ వినూత్నంగా వుండే శైలిని వాడాను. అయితే నా చుట్టూ వున్న వాస్తవిక విషయం పట్ల నాకేమీ మార్మిక దృష్టి లేదు. ఈ నవల ముందు మాటలు రాసినవాళ్ళలో కొందరు నాకు మార్మిక దృష్టి వుందన్నారు. కాని అది సరికాదు.

7. ఈ మిస్టిక్‌స్టైల్ తెలుగు సాహిత్యంలో ఇంకా ఎవరు పాటించారు ?

జ : నాకు తెలిసినంతవరకూ ఇంకెవరూ అనుసరించినట్టు లేదు. 'యజ్ఞం' కథలో కాళీపట్నం రామారావుగారు పాటించారు చివరి 4, 5 పేజీల్లో. 'ఇన్‌క్రెడిబుల్ గాడెస్', 'స్మశానం దున్నేరు'ల ఇతివృత్తం కూడా ఇదే. దళితుల బలహీనతల్ని అగ్రవర్ణాలవాళ్ళు ఎట్లా ఎక్స్‌ప్లాయిట్ చేస్తున్నదీ రాశాను. నా రచనలన్నిటా నేను చిత్రిస్తున్నదదే.

8. ఈనాడొస్తున్న స్త్రీవాద, దళిత వాదాల మీద మీ అభిప్రాయం ?

జ : సమాజంలో అన్ని రుగ్మతలకూ మూల కారణం ఆకలి, ఆర్థిక అసమానత. దీని గురించి కొన్ని పోరాటాలు జరుగుతున్నాయి. వాటిని వర్గ పోరాటాలంటారు. వాటికి మద్దతునిస్తూ మనం రాద్దాం. దానిలో భాగం

గానే స్త్రీవాద, దళితవాద ఉద్యమాలు జరిగితే మంచిదే. కాని దాన్ని పక్కన పెట్టేస్తే అది మంచి ట్రెండ్ అనుకోను. తమంతట తాముగా ఒంటెత్తు పోకడతో జరిపే ఈ పోరాటాలు వర్గ పోరాటాన్ని పక్కదారి పట్టించడానికీ, డైవర్ట్ చేయడానికి పనికొస్తాయి. దాన్ని నీరు కార్చినట్టవుతుంది. వర్గ పోరాటాన్ని వెన్నుపోటు పొడిచినట్టవుతుంది. స్త్రీల విషయంలో గానీ, కులం విషయంలో గాని వర్గ పోరాట మార్గంలోనే పరిష్కార ముంటుందని నా నమ్మకం.

9. స్త్రీవాదం పట్ల మీ ఈ దృక్పథానికీ, మీ రచనల్లో స్త్రీ పాత్రలు ప్రధానంగా లేకపోవడానికీ ఏమన్నా సంబంధముందా ?

జ : ఎంత మాత్రం లేదు. కాని నా రచనలు అలా వచ్చిన మాట నిజం. నేను ఎన్నుకున్న కథాంశాలకి సంబంధించి స్త్రీ పాత్రల ప్రమేయం తక్కువ. అలాగే, మీరు గమనిస్తే, నా నవలల్లో జీవితమంతా రోడ్ల మీదానూ, పొలాల్లోనూ, అడవుల్లోనూ, కొండల్లోనూ జరుగుతుంది. కుటుంబంలో జరిగే విషయాలు ఆ ఇతివృత్తాల్లో వుండవు. అందుచేత కూడా స్త్రీ పాత్ర అంత ప్రధానంగా రాలేదు. అయితే నిత్య జీవితంలో పురుషులకి లేని ప్రత్యేక సమస్యలు కొన్ని స్త్రీలకి వున్నాయని నేనూ నమ్ముతాను.

10. దళిత వాదం పట్ల మీ దృక్పథానికీ, మీ 'ఇన్‌క్రెడిబుల్ గాడెస్'లో దళితుల అనైక్యతని ప్రధానంగా చిత్రించడానికీ ఏమన్నా సంబంధం ఉందా ?

జ : సరిగ్గా అడిగారు. ఆ అనైక్యత పట్ల నాకు చాలా అసహనం ఉన్న మాట నిజం. ఆ నవల చదివిన వారిలో కూడా అటువంటి అసహనం కలగాలని నేను బలంగా కోరుకున్నా. అయితే నేనలా చిత్రించడంలో అనైక్యత ముందుకి దూసుకొచ్చి అసలు సమస్య వెనక్కి పోయిందని కొందరు తప్పు పట్టారు. ఆ లోపం ఆ చిత్రణలో తప్పులేదనుకుంటా.

11. దళితులు మాత్రమే దళిత సాహిత్యం రాయాలా ? దళితేతరులు అంత తీవ్ర స్పందనతో రాయలేరా ?

జ : 'మీకు రాయనవసరం లేదు. మీకు దళితుల గురించి రాసే అర్హత లేదు, యోగ్యత లేదు' అనడం అన్యాయం.

12. మీ రచనల్లో అట్టడుగు వారి జీవితం అంత బాగా ఎలా వచ్చింది ?

జ : అన్నీ నేను కళ్ళారా చూసినవే చిత్రించాను. చదివి తెల్సుకున్నవి కావు. అవి చూసినప్పుడు ఎంత విపరీతంగా స్పందించానంటే నెలల తరబడి వాటిని గురించే ఆలోచించేవాడిని. నా కథనం అందుకే శక్తివంతంగా వచ్చిందేమో !

13. మంచి నవల కుండాల్సిన లక్షణాలేమిటి ? యువ రచయితలకి మీరిచ్చే సూచన లేమిటి ?

జ : నిజానికి ఈ రెంటికీ జవాబొకటే. పాత్రలపట్ల నిజమైన ప్రేమ ఉండాలి. నువ్విచ్చే సందేశం పట్ల నీకు నమ్మకముండాలి.

14. ఈ రెండూ ఉన్న రచయితలు మీ దృష్టిలో ఎవరు ?

జ : రావిశాస్త్రి. తన పాత్రల్ని అమితంగా ప్రేమించారు. అల్లం రాజయ్య ఆ పాత్రలతో మమేకమైపోతాడు. నామిని కూడా లీనమైపోయి రాస్తాడు. ఇంతవరకే గుర్తొస్తున్నారు ప్రస్తుతానికి.

15. ఇటీవల తెలుగులో మీకు నచ్చిన నవలలేవి ?

జ : తెలుగులో వచ్చిన నవలలూ, నాకు నచ్చినవీ కూడా తక్కువేనని చెప్పాలి. దాశరధి రంగాచార్య 'చిల్లర దేవుళ్ళు', అల్లం రాజయ్య 'కొలిమంటుకుంది', నామిని 'మునికన్నడి సేద్యం', పతంజలి 'గోపాత్రుడు' మంచి నవలలు.

'వసంత గీతం', 'ఎల్లి' చాలా ఉదాత్తమైన ఇతివృత్తాలే అయినా వాటిని సమర్థవంతంగా రాయలేకపోయారు. నేను చదవడానికే చాలా ఇబ్బంది పడ్డాను.

మన శిల్పం, శైలి కూడా థీమ్‌ని బట్టి మారుతూండాలి. పాఠకుల్లో ఉత్కంఠ, ఆసక్తి కలిగించాలి, రగిలించాలి. కొత్త పోకడలతో నవలా రచన చెయ్యాలి.

16. ఇప్పుడు దేశంలో టి.వి. ఛానల్స్ ఉక్కిరిబిక్కిరి చేసేస్తున్నాయి. వీటి మధ్య నవలా సాహిత్యం ఊపిరి పోసుకుంటుందా ?

జ : టి.వి. ఛానెల్స్ వల్ల పాఠకుల సంఖ్య తగ్గిందని సర్వేలో తేలింది నిజమే. ఆ ఛానెల్స్‌ని ఎవరూ కట్టేయ బోవడం లేదు. మంచి సాహిత్యం ఈ చెడ్డ ఛానెల్స్‌తో పోటీపడాలి. అందుకే ఇందాకే చెప్పాను 'మనం రచనలో కొత్త పోకడలు అలవరచుకోవాలి.' అంతకన్నా ఇంట్రెస్టింగ్‌గా,

అందంగా, నేర్పుగా చెప్పాలి. అంటే ఇంకా పటిష్టంగా, శక్తివంతంగా చెప్పే శైలిని పెంపొందించుకోవాలి. అంతకన్నా వేరే మార్గం లేదు.

17. మీ రచనల్లో ఇవి మీరెలా పాటిస్తున్నారు ?

జ : నేను కాన్షస్‌గానే ప్రతి నవలలో కూడా ఆ శైలి వాడుతున్నా. పాఠకుడి ఇంట్రెస్ట్ సస్టైన్ అయేలా చూసుకుంటా. ప్రతి పది పేజీలకీ (ఫ్లాష్ పాయింట్స్ అంటారు) ఒక ఇంట్రెస్టింగ్ సన్నివేశం గానీ, శక్తివంతమైన డైలాగ్ గానీ, ట్విస్ట్ గానీ వుండేలా చూసుకుంటానన్న మాట. అందుచేత పాఠకులు కొసకంటా ఉత్కంఠతో చదువుతారు. ముందుగా అవన్నీ అనుకుని నవల ప్రారంభిస్తా.

18. సమాజం పట్ల రచయితకి విధిగా బాధ్యత వుండాలా ?

జ : బాధ్యతారహితంగా మాత్రం రాయగూడదు. కాలక్షేపం కోసం అసలు రాయగూడదు. మన రాతలవల్ల సమాజం ఒక్క అడుగన్నా ముందుకెయ్యాలి.

19. సాహిత్యం ద్వారా సమాజం మారుతుందంటారా ?

జ : అనను. ఎప్పటికైనా భౌతిక పరిస్థితుల వల్లే సమాజం మారాలి. కాని సాహిత్యం, కళలు అందుకు తోడ్పడతాయి.

—కృష్ణాబాయి

---

## ఏం లాభం

మన దేశంలో వంద ఫీట్ల రోడ్లుండీ ఏం లాభం
అరఫీటు వెడల్పులోనే నేను వొదిగి నడుస్తున్నపుడు !

—కౌముది

---

## కన్‌స్ట్రక్ట్ చెయ్యి

పసితనంలో ఆడతనాన్ని "ఇంజెక్ట్" చేసిన
ఈ దుష్ట సమాజాన్ని "రిజెక్ట్" చెయ్యి
వర్గ చైతన్యాన్ని "ప్రొజెక్ట్" చేసి
సమసమాజాన్ని "కన్‌స్ట్రక్ట్" చెయ్యి

—రక్తాక్షరి

అభిప్రాయం

# ముస్లిం సాహిత్యోద్యమానికి ఆరంభ సూచిక "జిహాద్"

'సాహిత్య గుత్తాధిపత్యాన్ని విరసం అంగీకరించదు' అనే 'అరుణ్' వ్యాసాన్ని 'వార్త'కు పంపినా అచ్చుకెక్కలేదంటేనే నేటి పత్రికలు సాహిత్య చర్చలను ఎంత అప్రజాస్వామికంగా నిర్వహిస్తున్నాయో తెలుస్తుంది. 'జిహాద్' ప్రచురణ తర్వాత ఆ సంకలన కవులు ఎవరూ నోరు మెదపకపోవడం నేరంగా భావిస్తూనే ఒకవేళ అలా మెదిపినా అచ్చుకెక్కలేదోనన్న అనుమానాన్ని వ్యక్తం చేసిన అనంత్ నేటి పత్రికల ధోరణిని సరిగ్గానే అంచనా వేసాదని చెప్పవచ్చు. అసలు ఈ పత్రికలన్నీ హైద్రాబాద్‌ను సాహిత్య రాజధానిగా కూడా గుర్తించా యనుకుంటాను. ఈ సాహిత్య రాజధానిలో వున్నవాళ్ళే, పత్రికలు నడిపేవారితో సంబంధం వున్నవాళ్ళే వీటి దృష్టిలో గొప్ప కవులు, విమర్శకులుగా పరిగణింప బడుతున్నారు (ఈ పత్రికల్లో పనిచేసేవారు సరేసరి). అయితే వీరు తప్ప మిగతా వారు చర్చల్లో పాల్గొనేందుకు అనర్హులు. వొకవేళ పాల్గొన్నా వారి అభిప్రాయాలు కూడా ప్రచురించే నిజాయితీ ఈ పత్రికల్లో ఎంతమాత్రం లేదు. ఈ పత్రికలు తమ ధోరణిని మార్చుకోనంతవరకు చర్చలన్నీ ఏకపక్షంగానే జరుగుతాయనడంలో ఎటువంటి సందేహం లేదు.

"జిహాద్" అచ్చువేసేముందు ఆ సంకలనం తేవాలనుకొన్నవారికి తెలియ జేయకుండా సంకలన కవుల అంగీకారం లేకుండా అచ్చువేయడం పొరపాటేనని విరసం అంగీకరించింది. అయితే ఖాదర్ మొహియుద్దీన్, ఖాజా కలిసి ముస్లిం కవితా సంకలనం తీసుకురావాలనుకుంటున్న తరుణంలో షరీఫ్ విరసం తరపున ప్రచురిస్తామని ఖాదర్‌ను అడగడం ఖాదర్ సంతోషాన్ని వ్యక్తం చేయడం గమనిస్తే ఖాదర్ అనుమతి లభించినట్టే. ఇక ఖాజా విషయానికొస్తే తను అచ్చేయాలను కొన్నాడు. నిజమే ! కాని విరసం అచ్చేయడం వల్ల అతనికి వచ్చిన నష్టం ఏమిటి?! ఇక్కడ గమనించాల్సిందేంటంటే వాదాన్ని అభివృద్ధి పరిచేందుకు పనిచేసేవారెవ రైనా తామనుకున్న పని మరొకరు చేస్తే సంతోషిస్తారేకాని, బాధపడరు ! ఇక్కడ పని జరగాలే కాని, చేసిందెవరో ముఖ్యం కాదు.

ఈ సందర్భంగా నేనొక సంఘటన చెప్పాలనుకుంటున్నాను. 'జిహాద్' ప్రచురణకు చాలాముందు నుంచే ముస్లింవాద కవిత్వాన్ని అచ్చేసేందుకు

'సైకిలాబాట' సన్నాహాలు చేసాడు దానికి సంబంధించిన పనిలో వుండగానే జిహాద్ ప్రచురించిన విషయం తెలిసింది [ఈ విషయం తెలిసినప్పుడు నాతోనే వున్నాడు] తాను చేయాలనుకున్న పని విరసం చేసిందని తెలియగానే అతను సంతోషించాడు. [వాస్తవానికి సైకిలాబాట విరసం వ్యతిరేకి] అతను వాదానికి విలువనిచ్చే కవి కావడంతో ఎవరు చేసారనేది కాకుండా పని జరిగినందుకు సంతోషించాడు. మరి విరసం ప్రచురించినందుకు వ్యతిరేకించేవారు వాదానికి, వాదంయొక్క అభివృద్ధికి ఏపాటి విలువనిస్తున్నారో అర్థం చేసుకోవచ్చు. పని ఎవరు చేసారో ముఖ్యం కాదు. పని జరిగిందా లేదా అనేది ముఖ్యం.

'విరసం చేయకపోతే మేము చేసేవాళ్ళం' అని వాదించేవాళ్ళు చేపట్టాల్సిన కార్యక్రమాలు చాలా వున్నాయి. తీసుకురావాల్సిన సంకలనాలు మరెన్నో ఉన్నాయి. ముస్లిం సాహిత్యోద్యమాన్ని పటిష్టం చేయాల్సిన బాధ్యత వారిపై ఉంది. 'జిహాద్' ముస్లిం సాహిత్యోద్యమానికి ఆరంభ సూచిక మాత్రమే. ఆరంభంలో తప్పులు దొర్లడం సహజమే. అంతమాత్రాన ఏదో చారిత్రక విషాదం జరిగిందంటూ బాధ పడడం ఎంత మాత్రం ఆమోదయోగ్యం కాదు. అలా చేసినవారిని "చారిత్రక నేరస్థులుగా" పరిగణించడం అంతకన్నా సమంజసం కాదు. జిహాద్ సంకలనం ప్రచురించినందుకు ముస్లింలంతా విప్లవ సాహిత్యాభిమానులై, విప్లవోద్యమంలో భాగస్వాములవుతారని భావించే వారెవరైనా సరే ముస్లింలను చంచల స్వభావులుగా భావిస్తున్నారని అర్థం చేసుకోవాల్సి వుంటుంది. ముస్లింలకంటూ ఓ లక్ష్యం వుంది. ఆ లక్ష్యాన్ని మరిచి విరసం సంకలనం తెచ్చినందుకు విప్లవోద్యమంలో భాగ స్వాములు కావడం, ఒకవేళ రేపు మరెవరైనా మరో సంకలనాన్ని తెస్తే వారి ఉద్య మంలో భాగస్వాములు కావడం అంటూ జరగదు.

నేడు ముస్లిం కవిత్వం కూడా వాదస్థాయికి చేరుకొని ప్రధాన స్రవంతిలోని కొచ్చింది, కాని ముస్లిం కవులకు కూడా నాయకత్వ పోరాటం సమస్యగా మారిన ట్టుంది. ప్రధాన స్రవంతిలోకొచ్చిన ముస్లిం సాహిత్య జగత్తును శాసించాలన్న దుగ్ధ ముస్లిం కవులలోనే కొంతమందిని పట్టిపీడిస్తున్నట్టుంది. అలా వెలుగొందాలనే ప్రయత్నంలోని భాగంగానే 'జిహాద్' ప్రచురణ వల్ల ముస్లిమీయతకు నష్టం వాటిల్లిం దంటూ విరసం మీద దుమ్మెత్తి పోసారు. ఈ నాయకత్వ పోరాటం ముస్లింవాద కవిత్వ పతనానికి కారణం కాకముందే ఈ కవులు ఇటువంటి పోరాటంనుంచి

బయటపడితే మంచిది. ఇటువంటి నాయకత్వ పోరాటమే దళిత కవిత్వాన్ని నీరు గార్చిందన్న విషయాన్ని ఈ కవులు గ్రహించడం ఎంతైనా అవసరం. ఈ సందర్భంగా "నిజానికి తెలుగు సాహిత్యంలో యుగకర్తల కాలం చెల్లింది కాబట్టి కవితోద్యమాలకు ఏ వొక్కరూ నాయకుడు కాలేరు" అన్న యాకూబ్ మాటల్ని [ఆంధ్రజ్యోతి త్రిశతాబ్ది ప్రత్యేక సంచిక 15–8–97] గుర్తుకు తెచ్చుకోవాలి.

ఇక జిహాద్ సంకలనంలోని కవితల ఎంపిక విషయానికొస్తే అందులోని కవితల్ని దేన్ని ప్రమాణంగా తీసుకొని ఎంపిక చేశారో ఇప్పటికీ అర్థంకాని విషయం. అయితే మెజారిటీని అదుపు చేయడమే నేటి సెక్యులరిజం అని ఘంటా పథంగా చెప్పాల్సిన అవసరం వచ్చేసిందంటూ అందుకే ముస్లిం కవుల గొంతును సంకలనంగా తీసుకు వస్తున్నామని విరసం జిహాద్ 'మా మాట'లో చెప్పుకుంది.

ముస్లిం కవుల గొంతును సంకలనంగా తీసుకొచ్చే క్రమంలో విరసం క్రింది రెండు పంథాలలో దేన్నయినా వొకదాన్ని అనుసరించి వుండాలి. మొదటిది ముస్లిం కవులు తమ భద్రతకై, ఉనికికై, హక్కులకై గొంతెత్తిన కవితలతో పాటు తమ లోని వెనుకబాటు తనంపై, ఛాందసవాదంపై విరుచుకుపడిన రెబెల్ కవిత్వాన్నీ సంకలనంగా తీసుకురావడం. విరసం ఈ విధంగానే చేసిందనుకుంటే అఫ్సర్ రాసిన 'ఊరవతలి దుఃఖం' ఖాజా 'అసమర్థుని మరణవాంగ్మూలం' సైకాబాబ 'డబ్బు కొట్టడమే న్యాయం' 'ఘూక్ కో ఫాఁసీదో' ఇక్బాల్‌చంద్ 'నా రెక్కల ముడి విప్పు', 'విషమాంత్రికుడికి', వలిహుసేన్ 'చేతులు తప్ప చేతల్లేనివాడు', మహమ్మదాలి 'రాండి', అక్బర్ 'వొకటి కాని ఓటికుండలు' మొదలైన కవితలేకాక ఇలా చెప్పుకుంటూపోతే పట్టుబడే కవితలను ఏ విధంగా ముస్లింవాద కవితలుగా అంగీకరించాలి? ఇటువంటి కవితలను ఏ కోణంతో చూసినా ముస్లింవాద తాత్త్వికత ఏ కోశానా కనబడడం లేదు.

ఇక రెండవది కవిత్వంతో సంబంధం లేకుండా కేవలం ముస్లింకవులు రాసిన ఏ కవిత్వాన్నైనా సంకలనంగా తీసుకురావడం అయితే హనీఫ్, దేవీ ప్రియలాంటి ముస్లిం కవులు కవిత్వం ఈ సంకలనలో చోటు చేసుకోకపోవడం వల్ల 'అరుణ్' విచారాన్ని వ్యక్తం చేసాడు కాని ఈ సంకలనంలో చోటు చేసుకో లేకపోయిన ముస్లిం కవులు కేవలం హనీఫ్, దేవీప్రియలేనా?! మహెజబీన్, ఇస్మాయిల్, వాహెద్, రహ్మతుల్లా, విరసం సభ్యుడైన యాకూబ్ పాషలాంటి

కవులు ముస్లింలు కారా ?! లేక వారి కవిత్వం పరిగణించదగ్గ స్థాయిలో లేదా ?! అనే ప్రశ్నలకు సమాధానం దొరకాల్సి వుంది. పై రెండు అంశాలను పరిశీలిస్తే జిహాద్ రూపకల్పనలో విరసం ఈ రెండు అంశాలలో ఏ ఒక్కదానినీ ప్రమాణంగా తీసుకోలేదని అర్థమవుతున్నది. మరి జిహాద్ రూపకల్పనకు ప్రమాణం ఏమిటో తెలియజేయాల్సిన బాధ్యత విరసానికే వుందని ఇప్పటికైనా గుర్తిస్తే మంచిది.

ఇక తొలగించిన కవితల విషయానికొస్తే ముస్లిం కవుల కవితా సంకలనంలో ముస్లిం పేరుతో ముస్లిమేతర కవులు రాసిన కవితలంటూ 'కర్తవ్యచిత్రం' 'ఓ గాడిద పుస్తైన్' అనే కవితలను తొలగించారు. మరి ముస్లిమేతర కవులు రాసిన కవితలను తీసేయాలనుకొన్నప్పుడు 'విలోమన్యాయం' కవిత ఎందుకు తొలగించ లేదు. ఈ విషయాన్ని ఖాజా గుర్తుచేసినా ఎటువంటి ప్రతిస్పందనా లేదు.

ఇక పుట్టుకతో హిందువైన వ్యక్తి ముసింలపై జరుగుతున్న అణచివేతకు స్పందించి రాయడంవల్ల నష్టమేమిటని అరుణ్ ప్రశ్నించాడు. వొక హిందువు ముస్లిం పేరుతో రాయడంవల్ల ముస్లిమీయతకు నష్టం కలిగే విషయం ఎలాగున్నా, అతను ముస్లింలపై జరుగుతున్న అణచివేతకు స్పందించి ముస్లింలతో మమేకం కావొచ్చు కాని వారి కష్టాలను స్వంతం చేసుకోలేడు. ఇక్కడ ముస్లిం తన పుట్టుక వల్ల ఎలాంటి అభద్రతకు గురవుతున్నాడో, తన ఉనికికి ఎలాంటి ప్రమాదం ఏర్పడిందో అటువంటి పరిస్థితులు ముస్లిమేతర వ్యక్తికి ఎదురుకావనే విషయాన్ని గమనించాల్సి వుంటుంది. కాబట్టి ముస్లిమేతర వ్యక్తి ముస్లిం సాహిత్యం రాయడ మంటే ఒక భూస్వామి విప్లవకవిత్వం రాయడంతో సమానం. అయితే అగ్రకులస్థులు దళిత కవిత్వం కాకుండా దళిత సంఘీభావ కవిత్వం రాయాలని 'కాస్తా సిగ్గుపడదాం' సంకలనం వెలువడింది. ఈ సూత్రాన్నే అనుసరిస్తే ముస్లిమేతర కవులు కూడా ముస్లింవాద కవిత్వం కాకుండా తాము ముస్లింల పట్ల ప్రవర్తించిన తీరునీ, అణచి వేతనీ రాయాలి అంటే ముస్లిం సంఘీభావ కవిత్వం రాయడానికి ఎలాంటి అభ్యం తరం వుండబోదు.

సాహిత్య రాజధాని కేంద్రంగా మనుగడ సాగిస్తున్న నేటి పత్రికలేవీ "జిహాద్"ను ఇంతవరకూ సమీక్ష చేయకపోవడం శోచనీయం. మన తెలుగు సాహిత్యంలో విమర్శకులుగా చలామణి అవుతున్న వారెవరయినా జిహాద్‌లోని కవిత్వం గురించి ఓ చిన్నముక్కయినా రాయకపోవడం జిహాద్‌కే కాదు ముస్లింలకు

కూడా అన్యాయం చేసినట్టే. ముస్లింలకు ఏదో అన్యాయం తలపెట్టిందంటున్న విరసమే జిహాద్ సంకలనాన్ని 'అరుణతార'లో సమీక్ష చేసిన విషయం గమనించ దగ్గది.

జిహాద్ ప్రచురణ వల్ల విరసం ముస్లింలకు ద్రోహం చేసిందనీ సాహిత్య సామాజిక గతిని నిర్దేశిస్తున్న వొక కీలకమైన ధోరణిని పెడత్రోవ పట్టింప యత్నించిందనీ భావించడం అవగాహనా రాహిత్యానికి విరసం యెడల గల వ్యతిరే కతకు నిదర్శనం. జిహాద్ హిందూత్వాధిపత్య సమాజాన్ని ప్రతిఘటించడానికి ఉపయోగపడుతున్నదనేది ఎంత కాదన్నా వాస్తవం.

చివరిగా ఎవరు అంగీకరించినా అంగీకరించకపోయినా ముస్లింల లక్ష్యాన్ని జిహాద్ సంకలనం మరో అడుగు ముందుకు తీసికెళ్ళడానికి తోడ్పడుతుందనేది నిర్వివాదాంశం.

—గౌస్ మొహియుద్దీన్

## స్వీకారం

1) బ్లో అవుట్ (కవితా సంపుటి) : రొక్కం కామేశ్వరరావు, చైతన్య ప్రచు రణలు. పేజీలు : 16+48. వెల : 25 రూ. లైబ్రరీ ప్రతి : 50 రూ. ప్రతులకు : విశాలాంధ్ర బుక్ హౌస్, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాద్; నవోదయ బుక్ హౌస్, కాచిగూడ, హైద్రాబాద్, దిశ బుక్ సెంటర్, 1-8-304/2, చిక్కడపల్లి, హైద్రాబాద్–20. మైత్రి బుక్ హౌస్, కారల్ మార్క్స్ రోడ్డు, విజయవాడ–2.

2) పోరుబాట (నవల) : పి.నాసరయ్య. పేజీలు : 6+172 వెల : 25 రూ. ప్రతులకు : పి నాసరయ్య, నిజాంపట్నం, గుంటూరు జిల్లా; చార్వాక్ బుక్ హౌస్, నిడమర్రు (P.o), మంగళగిరి-522503, గుంటూరు జిల్లా.

3) కృష్ణాజిల్లా అమరవీరులు : మహోజ్వల తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటం 50 వ వార్షికోత్సవం సందర్భంగా సి.పి.ఐ. (యం.యల్) జనశక్తి కృష్ణాజిల్లా కమిటీ ప్రచురణ. వన్‌ఫోర్త్ డెమ్మీసైజు 74 పేజీలు వెల : 30 రూ. ప్రతులకు : మైత్రీ బుక్‌హౌస్, మసీదు వీధి, కారల్ మార్క్స్ రోడ్, విజయవాడ–520002.

**లేఖలు :**

# దోపిడి వర్గాల మాతృమూర్తి

మదర్ థెరిసా ఒకసారి విజయవాడకు వచ్చారట. అప్పుడు మాస్టారు (కా॥ ఐ. వి.) పనిచేసే కాలేజీకి కూడా వచ్చారట. కాలేజీలో ఏర్పాటు చేసిన మీటింగ్‌లో మాస్టారును కూడా మాట్లాడమన్నారట. ముందుగా మదర్ పేదల సేవ గురించి చాలాసేపు మాట్లాడారట. తర్వాత మాస్టారు మాట్లాడుతూ 'పేదల సేవ గొప్పదే. పేదల సేవ చేయడం చాలా మంచిది. కానీ పేదలకు ఎప్పుడూ సేవ చేస్తూ ఉండాలంటే సమాజంలో ఎప్పుడూ పేదలు, పేదరికం ఉండాలి. అందుకని పేదలు లేని సమాజం వస్తే అదింకా గొప్పగా ఉంటుంది. పేదల సేవ కంటే పేదరికం లేని సమాజం కోసం పోరాడడం చాలా మంచిది' అని మాట్లాడారట. తర్వాత మదర్ మాస్టారితో 'మైబాయ్! నువ్వు సోషలిజం కోసం పోరాడతావన్నమాట. సరే, నీ దారిలో నువ్వు ప్రయత్నం చెయ్. నా దారిలో నేను ప్రయత్నం చేస్తా' అన్నారట. ఇవి మాస్టారు చెప్పగా నాకు గుర్తున్న విషయాలు.

మదర్ థెరిసా చనిపోయాక జరిగిన హడావిడి చూస్తే, మాస్టారు అన్నట్లుగా ప్రపంచంలోని పాలకవర్గాలు పేదరికాన్ని శాశ్వతం చేసి, పేదల సేవను ఆదర్శం చేసి చూపడానికి పడుతున్న తాపత్రయం అర్థమవుతుంది. ఆ క్రమంలోనే మదర్ థెరీసా ప్రపంచంలో దోపిడి వర్గాలకు మాతృమూర్తి అయింది.

వెనుకబడిన దేశాలలోకి సామ్రాజ్య వాదంతోబాటే, వారి దోపిడిని, సంస్కృతిని శాశ్వతం చేయడానికి క్రిష్టియన్ మిషనరీలు కూడా చొరబడ్డాయి. అలా మనదేశం చేరిన మాతృమూర్తి థెరిసా 70 సంవత్సరాలు కృషి చేసినా, ఆమె తను కేంద్రంగా చేసుకున్న కలకత్తాలో గాని, సంస్థలు నడిపిన భారత్ తదితర దేశాలలో గాని పేదరికం ఏ మాత్రం పోకపోగా రోజు రోజుకూ పెరుగుతూనే వుంది. ఆ పేదరికంతోబాటు పేదల మాతగా థెరీసా పేరు కూడా పెరిగిపోయింది. నోబెల్ బహుమతి, భారతరత్న – ఇలా ప్రపంచ ప్రఖ్యాతి పెంచుకుంటూ ఆమె పేదలసేవ నిరాఘాటంగా సాగిపోతున్నది. పేదలకు మాత్రం పేదరికమే మిగిలింది.

సామ్రాజ్యవాదానికి ప్రపంచవ్యాప్తంగా ప్రజలు గోరీ కడుతున్న తరుణంలో థెరిసాలాంటి పాలకవర్గ మాతృమూర్తులు తమను కాపాడతారని వారు ఆశపడడంలో ఆశ్చర్యం లేదు. కానీ ఇప్పటికే పేదరికం లేని రాజ్యం, సోషలిజం, కమ్యూనిజం తమ విముక్తి లక్ష్యంగా ఎంచుకున్న ప్రజలు వాళ్ళ ప్రచారానికి మోసపోయే ప్రశ్నే లేదు.

—మంజీర

# రిజర్వేషన్లు "దయాదాక్షిణ్యాలతో" వేసిన కుక్కబిస్కెట్లు కావు !

ఆగస్టు '97 సంచికలో "ఇది మాస్ మూమెంట్" కవితపై వచ్చిన విమర్శకు జవాబు—

విమర్శలో ప్రధానాంశాలు :

* పాలకవర్గాలు దళితులకు రిజర్వేషన్లు ఇచ్చి వారిని జోకొట్టాలని చూస్తున్నా యనే అవగాహనలో 'రిజర్వేషన్ల'ను 'కుక్క బిస్కెట్లు'గా శ్రామికుడు చెప్పాడనిపిస్తుంది. కాని రిజర్వేషన్లు పాలక వర్గాల దయాదాక్షిణ్యాలతో కల్పించబడినవి కావు. (ఒప్పు)
* కొన్ని సంవత్సరాల తరబడి సాగించిన పోరాట ఫలితమే నేటి రిజర్వేషన్లు (ఒప్పు)
* నిజానికి రిజర్వేషన్లను 'కుక్క బిస్కెట్లు'గా అర్థం చేసుకుంటున్నది పాలక వర్గాలు. (ఒప్పు)
* అయితే ఈ విషయం చెప్పడానికి మనం రిజర్వేషన్లను 'కుక్క బిస్కెట్ల'తో పోల్చనక్కర లేదు. (?)

చివరి వాక్యం మాత్రం నేను వ్రాసిన కవితలో రిజర్వేషన్ల గురించి వ్రాసిన ఉపమానాన్ని విభేదిస్తుంది. ఇక్కడ మరింత స్పష్టత ఇస్తే విమర్శకర్త అర్థం చేసుకుంటాడనుకుంటా.

రిజర్వేషన్లు కుక్క బిస్కెట్లు అంటే ప్రజల పోరాటాల్ని, ప్రజల హక్కులను కించపరిచే సందర్భంలోనూ ఆ ఉద్దేశ్యంతోనూ అన్నది కాదు. అలా అని ఉంటే తరువాతి వాక్యం "తాళలేకపోయింది రాజ్యం బొమికలు కూడా మిగల్చనంటూ తుపాకీని అటు ఇటు తిప్పింది" అన్న వాక్యం వ్రాసేవాణ్ణే కాదు.

రిజర్వేషన్లను మనమే కుక్క బిస్కెట్లుగా భావిస్తే రాజ్యం 'తుపాకి తిప్పేదే' కాదు ! ఆ కవితలో అలా వ్రాయడంలో ఉద్దేశ్యం సరిగ్గా రాజ్య మేమను కుంటుందో తెలియచెప్పడమే. ప్రజాస్వామ్యాన్ని అమలులో ఉంచాలనుకున్నట్టు ఫోజిచ్చే రాజ్యాన్ని బట్టబయలు చేయడమే! కాబట్టే రాజ్యం ఆగ్రహించినట్టు కవితలో వాక్యాన్ని చేర్చింది. రాజ్యం నిజంగానే దయాదాక్షిణ్యాలతో రిజర్వేషన్లు మన మొహాన కొట్టుంటే అవి ఆగ్రహించినట్టు వ్రాయాల్సిన అవసరం ఉండేదే కాదు.

సరిగ్గా విమర్శకర్త చెప్పినట్టే "దళితుల పోరాటాలకు తలవొగ్గక తప్పని పరిస్థితుల్లో కల్పించబడిన ఈ రిజర్వేషన్లను దళితులను మభ్యపెట్టడానికో, తాము చేస్తున్న దోపిడిని, అమలుచేస్తున్న అణచివేతను ఎదిరించకుండా వారి సంతృప్తి పరచడానికో...." రిజర్వేషన్లనే బిస్కెట్లు విసిరి మనల్ని అరవకుండా చేద్దామనుకుంది. అయితే దాని వెనుక దయాదాక్షిణ్యాలు ఏమీ లేవు. గత్యంతరం లేని పరిస్థితి తప్ప! ప్రజలనుభవించే ప్రతి హక్కు వెనుక ఒక పోరాటం వుంది. ప్రతిగా రాజ్యం రాజ్యాధికారాన్ని పణంగా పెట్టలేక "బిస్కెట్లు" విసురుతుంది. అలా చేసి ప్రజా స్వామిక ఫోజునైనా మిగుల్చుకుందామనుకుంది. మనం దాన్ని expose చేస్తున్నాము. అందుకే రాజ్యం ఆగ్రహిస్తుంది.

నాకు తెలిసీ ఈ అర్థమే కవిత ద్వారా స్ఫురిస్తుందని అనుకుంటున్నాను. అయితే "తాళలేకపోయింది రాజ్యం...." వాక్యాన్ని విడగొట్టి చూస్తే ఏదో రిజర్వేషన్లు రాజ్యం దయాదాక్షిణ్యాల మీద ప్రాప్తించినవి అనే అర్థం స్ఫురించే ప్రమాదం వుంది. అలా కాకపోతే గత్యంతరం లేక మన హక్కుల కొరకు జరిగే పోరాటానికి తలవొగ్గి ఆ పోరాటం రాజ్యాధికారం కోసం జరిగే పోరాటం వైపు మలుపు తిరగడం ఇష్టంలేక మన అరుపును ఆపడానికి "ఎర" చూపినట్టు ప్రయత్నం చేసిందన్నట్టుగానే అర్థం అవుతుంది.

—శ్రామికుడు

---

# నేనిప్పుడు కాలం ఎగరేసిన జెండాని !

నా చుట్టూ గీసిన అన్ని రేఖల్ని దాటుతున్నాను
విధినీ, విధి రాతనీ బహిష్కరిస్తున్నాను
బతికే హక్కు ఉన్నవాణ్ణి
భౌతిక అంకెలని చెరిపేస్తున్నాను—
చైతన్యాన్నై - ఒక స్వేచ్ఛా విహంగాన్నై !
మీ బాంచగా వొంగి వొంగి దండాలెట్టిన నా వినయభంగిమలోంచి
ప్రశ్నగా పుట్టుకొస్తున్నవాణ్ణి
సమాధానాలకి తాళపత్రాలు తిరగేసే తీర్థస్నాతలారా
తలరాత జవాబులన్నీ తప్పుడు సాక్షిలే
కర్మకాండల కుత్సితాలన్నీ మీ బాజా భజంత్రీలే
మిమ్మల్ని మీరు అంటరానివాళ్లుగా వదిలేసిన మీ దేహాల్ని సంస్కరిస్తున్న
వాణ్ణి

నా పేదరికానికి అంటరానితనం అంటగట్టిన
మీ కుంటి దిక్సూచి గ్రంథాలకి చితిపేరుస్తున్నవాణ్ణి
జాతి జీవన స్రవంతిలో ఉద్యమధారనై ప్రవహిస్తున్నవాణ్ణి
నేను పీల్చే గాలినే మీరు పీలుస్తున్నప్పుడు
నేను తాగే నీటినే మీరు తాగుతున్నప్పుడు
మిమ్మల్ని దహించే నిప్పుని నేను రాజేస్తున్నప్పుడు
నేను పుట్టిన మట్టే మీకు జన్మభూమైనప్పుడు
మీరు చేరే నింగికే నేనూ ఎగిసిపోతున్నప్పుడు
నేనెలా అంటరానివాణ్ణయ్యాను ?
మీరెలా అంటురోగులయ్యారు ?
మా చెరువు లెందుకు వేరయ్యాయి ?
మీ బావులెందుకు మడికట్టుకున్నాయి ?
శ్లోకాలతో బతుకు వ్యాపారాలు సాగించిన
మీ ధర్మగ్రంథాల కళేబరాలకి శుద్ధకర్మలు నిర్వహిస్తున్నవాణ్ణి
మీ మనువులకీ, మన్వంతరాలకీ
కవితా పిండం వొదులుతున్నవాణ్ణి
నేనిప్పుడు కాలం ఎగరేసిన జెండాని !

— ఏటూరి నాగేంద్రరావ్

Annual Subscription Rs. 50/- Single Issue Rs. 5/-

# జై బోలో స్వతంత్ర భారత్ కీ!

పిచ్చిదో, ఎచ్చిదో, చిల్లిదో, ఓటిదో- ఏదైతేనేం
కుక్కలు నాకేసిన ఖాండానైనా
తెల్లోడు మన చేతికిచ్చినందుకు
జరుపుకుందాం యాభై వత్సరాల స్వాతంత్ర్యాన్ని!
ఆకలి చావుల్లో, అఘాయిత్యాల్లో
లాకప్ హత్యల్లో, ఎన్‌కౌంటర్ చావుల్లో
లెక్కేసుకుందాం రాలిన బతుకుల్ని
సుడిగాలులో, పెనుగాలులో- ఏవైతేనేం

తలుపులు బార్లా తెరిచి నిలుచుందాం
సూర్యచంద్రులే ఇంటిదీపాలని మురిసిపోదాం!
గోల్డెన్ షేక్‌హాండో, రిట్రెంచ్‌మెంటో
లేఆఫో, లాకౌటో– ఏమైతేనేం
దభేలున మూసిన తలుపుల సందున
చితికిన వేళ్ళని చూసుకొని, భోరుమందాం!

నల్లదొరలారా!
పులిసిన పులుసులో పాసిన బువ్వను గజ్జిచేత్తో పిసుక్కొని
కసిగా తింటున్న పిలగాళ్ళ నోళ్ళలో ఓ చాక్లెట్ ముక్కైనా పెట్టండి!
నిండినోడు పారేసిన పుల్లిస్తరాకుల్లో
కుక్కలతో కాట్లాడి, చిన్నముక్క అందుకున్నపుడు
ఎంత ఆనందమో, ఈ పండగనాడు తలుచుకుందాం!

ఖజానా ఖాళీ అయితే
ఇప్పటికి అమ్మంగా ఇంకేమైనావుంటే
'వాడికి' ఇచ్చి మువ్వన్నెల జండా ఎగరేద్దాం!
పై యేటికి, జండాగుడ్డకి జేబులు నిండుకుంటే
వాడినే ఎగరేయమందాం!
జై బోలో స్వతంత్ర భారత్ కీ!

— చంద్రవంక

Printed at Nagendra Press, VJA-2, on behalf of Venkataramana Printers, Guntur-1, for Revolutionary Writers' Association.



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA101M114 |
| పుస్తకం పేరు | అరుణతార |
| తారీఖు | 08 February 2025 |
| ముందు అట్ట | [illegible] |
| వెనుక అట్ట | [illegible] |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినవారు | susmitha |
| పేజీలు విడదీసినవారు | bhanusree |
| స్కాన్ చేసినవారు | akshaya |
| పరీక్ష చేసినవారు | sireesha |
| పేజీలు సరిచూసినవారు | |
| బైండింగు చేసినవారు | |
| ప్యాకింగు చేసినవారు | |
| పరిస్థితి | Good. |